# చంద్ర రాజేశ్వరరావు వ్యాసావళి 1969, 73 వేర్పాటువాద ఉద్యమాలు

చంద్ర రాజేశ్వరరావు

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్ భవన్, అబిడ్స్, హైదరాబాదు-500 001.

# చంద్ర రాజేశ్వరరావు
# వ్యాసావళి
# 1969, 73 వేర్పాటువాద
# ఉద్యమాలు

చంద్ర రాజేశ్వరరావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

రాజకీయ/సామాజిక/ఆర్థిక గ్రంథాలు

ప్రచురణ నెం. : 4

మొదటి ముద్రణ : నవంబరు, 2001

వెల: రూ.10-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్-హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్, హైదరాబాదు-500 029.

# తొలి పలుకులు

1956 నవంబరు 1న ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము 1969 లో తెలంగాణా వేర్పాటు ఉద్యమాన్ని, 1972 లో జై ఆంధ్ర ఉద్యమాన్ని చవి చూసింది. 2000 సంవత్సరం నవంబరు 1న నూతనంగా జార్ఖండు, చత్తీస్ ఘడ్, ఉత్తరాంచల్ రాష్ట్రాలు ఏర్పడడంతో అయా రాష్ట్రాలలోని వేర్పాటు వాద ఉద్యమాలకు నూతన ఉత్తేజం వచ్చింది. అలాగే తెలంగాణాలో కూడా మరోమారు వేర్పాటు ఉద్యమం ప్రారంభమయింది. అంతకుముందు తెలంగాణా ప్రాంత అభివృద్ధికి యిచ్చిన హామీలు అమలు జరగలేదు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల సమతూకాభివృద్ధి జరుగకపోవడం ఈ ప్రాంతం వెనుకబడి ఉండడానికి ఒక ప్రధాన కారణం.

తెలంగాణా ప్రాంతములో నీటి వనరుల అభివృద్ధి, ఉపేక్షింపబడింది. ఉన్న పరిశ్రమలలో కొన్ని మూత బడ్డాయి. మరికొన్ని ప్రైవేటీ కరించడం, ఆర్థిక ప్రగతి మందగించడం జరిగింది; ఉద్యోగ వసతి మృగ్యమయింది; నిరుద్యోగం పెరిగింది; ఉన్న కొద్దిపాటి ఉద్యోగ వసతి కూడ తమకు గాక ఆంధ్ర ప్రాంతీయులకు దొరికిందనే అసంతృప్తి విద్యార్థికులలో వచ్చింది. వ్యవసాయ ఉత్పత్తులు తరచు దెబ్బతినడం, పండిన పంటలకు గిట్టుబాటు ధరలు లేకపోవటం, అప్పుల భారం పెరగడం, ప్రభుత్వ విధానాల వైఫల్యంతో రైతుల ఆత్మహత్యలు పెరిగాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక, రైతాంగ వ్యతిరేక విధానాలు, ప్రపంచీకరణ, ఉదారవాద విధానాలు, దేశ రాష్ట్ర ఆర్థికాన్ని పెట్టుబడిదారీ ప్రపంచ ఆర్థిక విధానంతో ముడిపెట్టి, విదేశీ పెట్టుబడికి, సరుకుల దిగుమతులకు దేశ కవాటాలను బార్లా తెరిచిన ఫలితంగా చిన్న పరిశ్రమలు, లఘు పరిశ్రమలు, వ్యవసాయం దెబ్బతిన్నాయి. విదేశీ కారుచౌక దిగుమతులతో మనదేశ, రాష్ట్ర వ్యవసాయదారుల అస్తిత్వానికే ముప్పు వచ్చింది. అంతర్జాతీయ ద్రవ్య సంస్థ, ప్రపంచ బ్యాంకు ప్రపంచ వాణిజ్య సంస్థలను సాధనాలుగా చేసుకొని సామ్రాజ్యవాదులు సాగిస్తున్న నయా వలస విధాన ఫలితాలు, మనదేశ ఆర్థిక పరిస్థితిని, పారిశ్రామిక వ్యవసాయ రంగాలను దెబ్బ తీసాయి. ప్రజలలో అసంతృప్తి జ్వాలలు వ్యాపించాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ విధానాలపై పోరాటాలు ఉధృతమవుతున్నాయి. ఈ పూర్వరంగంలో ప్రత్యేక రాష్ట్రంలోనే తెలంగాణా ప్రాంత అభివృద్ధి

జరుగుతుందనే నినాదంతో తెలంగాణా వేర్పాటు వాద ఉద్యమం మరల తలెత్తింది. ఇందుకు తోడు అధికార కాంక్ష వగైరా ఇతర కారణాలు లేవని చెప్పలేము. కాని ఒక విషయం మాత్రం స్పష్టం. పాలకుల విధానాలకు వ్యతిరేకంగా పెరుగుతున్న పోరాట జ్వాలలను ఈ ఉద్యమం ప్రక్కదారి పట్టిస్తున్న విషయాన్ని ఎవరూ కాదనలేరు. అయితే ఈ విషయాలు ప్రజలకు స్పష్టంగా తెలియడం కష్టం.

ఈ సందర్భంగా భారత కమ్యూనిస్టు పార్టీ అగ్ర నాయకులు, దాదాపు 25 సంవత్సరాలు జాతీయ రాజకీయరంగంలో ముఖ్యపాత్ర వహించిన కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు గారు తమ సుదీర్ఘ రాజకీయ అనుభవంతో 1969 లో వచ్చిన ప్రత్యేక తెలంగాణా ఉద్యమ సందర్భంలోనూ, 1972 జై ఆంధ్ర ఉద్యమ సందర్భంలోనూ వ్రాసిన వ్యాసావళిని, విశాలాంధ్ర ప్రచురణాలయం ఒకచోట చేర్చి చిన్న పుస్తక రూపంలో తేవడానికి చేసిన కృషి ఎంతో సందర్భోచితంగా ఉంది. మన రాష్ట్ర ప్రజానీకానికి వేర్పాటు వాద ఉద్యమం, పూర్వాపరాలు, మంచి చెడ్డలు తెలుసుకోడానికి ఈ చిన్న ప్రచురణ ఎంతగానో తోడ్పడుతుందనటంలో సందేహంలేదు.

కామ్రేడ్ రాజేశ్వరరావుగారి వ్యాసాలలోని ఈ క్రింద ఉల్లేఖించిన భాగాలను తెలుగు ప్రజానీకం తెలుసుకోవడం అవసరం. ప్రత్యేక తెలంగాణా ఉద్యమ సందర్భంలో 1969 మార్చి 9 న వ్రాసిన వ్యాసంలో వారు వెలిబుచ్చిన అభిప్రాయం.

"భారతదేశం యొక్క ఐక్యత, ప్రాదేశిక సమగ్రత, లౌకిక ప్రజాతంత్ర వ్యవస్థ భగ్నపరచబడే ప్రమాదం ముంచుకొచ్చింది. మత దురహంకారం, కుల ద్వేషం, భాషా దురభిమానం, ప్రాంతీయ విభేదాలు మొదలైన దుష్టశక్తులు కోరలు విప్పుకొని తాండవం చేస్తున్నాయి. ఈ విచ్ఛిన్న శక్తులను గుత్త పెట్టుబడిదారులు, భూస్వాములు, యితర అభివృద్ధి నిరోధక స్వార్థపర వర్గాలన్నీ – అమానుషమైన జీవిత పరిస్థితులకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజాసామాన్యం యొక్క ఐక్యతనూ, అనుదిన ప్రవర్ధమానమైన ఉత్సాహాన్నీ భగ్నం చేయడానికి ఉపయోగించుకొంటున్నాయి."

ఇదే వ్యాసంలో కాంగ్రెసులోని ముఠాకోరు విధానాలను గురించి చేయవలసిన కర్తవ్యాన్ని గురించి ఈ క్రింది విధంగా వ్రాశారు.

"కాంగ్రెసు దుష్పరిపాలనను గురించీ, వారి ముఠాకోరు విధానాల వల్ల కలిగిన దురదృష్టకర ఫలితాలను గురించీ బ్రహ్మాండమైన ఆందోళనను కొనసాగించాలి. ఈ అంతరంగిక కుటుంబ కలహాలవల్ల ఆంధ్రప్రదేశ్

యొక్క సర్వతోముఖాభివృద్ధి ఏ విధంగా తిరోముఖం పట్టింది, అభివృద్ధి నిరోధక భూస్వామ్య శక్తులూ, నూతన ధనిక వర్గాలూ, యితర స్వార్థపర వర్గాలూ యెలా ప్రాబల్యంలోనికి వచ్చి ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపర్చడానికి జరిగే ప్రజా ఉద్యమాలను బలహీన పరిచిందీ ప్రజలకు వివరించాలి. అభివృద్ధి నిరోధక విచ్ఛిన్నశక్తుల దాడిని సకల సాధనాలను ప్రయోగించి తిప్పికొట్టాలి. ప్రజల ఐక్యతను, ఆంధ్రప్రదేశ్ యొక్క సమగ్రతను ప్రజాతంత్ర ఉద్యమాభివృద్ధిని సాధించాలి. కమ్యూనిస్టు ఉద్యమాన్ని రక్షించాలి. కమ్యూనిస్టు ఉద్యమం ఐక్యమై యితర ప్రజాతంత్ర శక్తులను, వర్గాలను కలుపుకొని ఐక్యాందోళన సాగించినట్లైతే ఈ అభివృద్ధి నిరోధక విచ్ఛిన్నకర దుష్టశక్తుల దాడిని ఓడించగలం."

జై ఆంధ్ర ఉద్యమం సందర్భంగా 31-1-1973న వ్రాసిన విశాలాంధ్ర వ్యాసంలో ప్రాంతీయ అసమానతలకు కారణాలు వివరిస్తూ, రాష్ట్ర విభజన వల్ల ఉత్పత్తిల్లే ప్రమాదాలను గురించి ఇలా చెప్పారు.

"కాంగ్రెసు ప్రభుత్వ విధానాలు రాష్ట్రంలో ప్రాంతీయ అసమానతలను పెంపొందించి ఆర్థిక స్తబ్దతను సృష్టించాయి. పర్యవసానంగానే విస్తృతస్థాయిలో నిస్పృహ ఏర్పడింది. ప్రాంతీయ అసమానతలు ప్రాంతీయ విభేదాలను సృష్టించి పెట్టాయి. కాంగ్రెసు అధికారం కోసం ఏర్పడిన ముఠాలు, తదితర అభివృద్ధి నిరోధక శక్తులు ప్రాంతీయ ఉన్మాదాన్ని రెచ్చ కొట్టాయి. ప్రత్యేకవాదుల డిమాండ్‌కు యిదే మూల కారణం. సమన్వయ పూర్వక అభివృద్ధిలోనే ప్రజల ప్రయోజనాలు యీడేరతాయి. రాష్ట్రం అంతా ఒకే ప్రభుత్వం కింద ఉన్నప్పుడే అది సాధ్యం."

"ఆంధ్రప్రదేశ్‌ను ముక్కలుగా విభజించడంవల్ల ప్రస్తుత సమస్యలు పరిష్కారం కాకపోగా, అనేక చిక్కు సమస్యలు ఏర్పడతాయని, తద్వారా జాత్యహంకార, అభివృద్ధి నిరోధక శక్తులు వివిధ ప్రాంతాల మధ్య శత్రుత్వాన్ని రెచ్చకొట్టేందుకు మరింత అవకాశం కలుగచేస్తుందని మాదృఢమైన అభిప్రాయం. పర్యవసానంగా, ఐక్యరాష్ట్రంలో మాత్రమే సాధ్యమయ్యే సమన్వయ పూర్వక, సమగ్రాభివృద్ధి పూర్తిగా నాశనమైపోతుంది. అందుచేత, తెలుగు ప్రజల ఐక్య రాష్ట్రాన్ని పరిరక్షించేందుకై మేం నిర్ద్వంద్వంగా పోరాడుతున్నాం."

ఇటువంటి అభివృద్ధి నిరోధక ఉద్యమాల వల్ల వర్తమాన సమస్యల నుండి ప్రజల దృష్టిని మళ్ళించడం జరుగుతుందని హెచ్చరిస్తూ ఇలా వ్రాశారు.

"ఈ అభివృద్ధి నిరోధక క్రమంలో వర్తమాన సమస్యలు – పేదరికం, నిరుద్యోగం, పెరిగిపోతున్న ధరల నుండి ప్రజల దృష్టిని మళ్ళిస్తారు. పర్యవసానంగా దేశ ఆర్థికాభివృద్ధి కార్యక్రమానికి స్వస్తి చెబుతారు. మన దేశాన్ని వెనుకబడిన దేశంగానే ఉంచాలని కోరుకుంటున్న అమెరికా సామ్రాజ్యవాదులకు తమ దొంగ డబ్బును రక్షించుకోవాలని కోరుకునే భారత ప్రజల రక్తాన్ని త్రాగే బడా పెట్టుబడిదారులు, మనదేశ అభివృద్ధిని అరికట్టాలని, గత మూడు సంవత్సరాలుగా సాధించిన అభివృద్ధిని తిప్పికొట్టాలని వాంఛించే అభివృద్ధి నిరోధక శక్తులకు యిది సంతోషం కలుగజేస్తుంది."

## చిన్న రాష్ట్రాలు:

ప్రత్యేక తెలంగాణాలో సత్వర అభివృద్ధి సాధ్యమా? లేదా అన్న విషయాన్ని పరిశీలించడం అవసరం. ఈనాడు రాష్ట్రాల ఆర్థిక పరిస్థితి ఏమిటి? దినదిన గండంగా రిజర్వు బ్యాంకు ఓవర్ డ్రాఫ్టులపైన కాలం దొర్లిస్తున్నాయి. కేంద్రప్రభుత్వ అప్పులకు, ప్రపంచ బ్యాంకు అప్పులకు, ప్రజల నుండి సేకరించిన అప్పులకు వడ్డీలు చెల్లించలేని పరిస్థితిలో ఉన్నాయి. పెట్టుబడులకని సేకరించిన అప్పుల నుండి రెవిన్యూ ఖాతాలోని లోటును పూడ్చుకొంటున్నాయి.

ప్రభుత్వ పరిపాలనా ఖర్చులు పెరిగిపోయి, దాదాపు నూటికి 80 వంతుల వరకు రాష్ట్ర బడ్జెట్ వ్యయం ఆ పద్దుకిందే పోతోంది. ప్రధానమైన ఆదాయ వనరులు కేంద్రం చేతిలో ఉన్నాయి. ప్రజలపై కొత్త పన్నులు విధించడానికి ఒక పరిమితి ఉంది. మన రాష్ట్ర పరిస్థితి చూస్తే, నీటి తీరువా, విద్యుత్ ఛార్జీలు వగైరా పెంచారు. ప్రభుత్వ ఆసుపత్రులలో వైద్యానికి మామూలు ప్రజల నుండి కూడా ఫీజులు వసూలు చేస్తున్నారు.

ఈ పరిస్థితులలో మనదేశ ఆర్థికాన్ని ప్రపంచ ఆర్థికంతో జోడించడం వల్ల, ప్రపంచ వాణిజ్యసంస్థ నిబంధనల మేరకు, దిగుమతి సుంకాల తగ్గింపు అనివార్యమయింది. మార్కెట్ ఆర్థిక విధానంవల్ల ప్రభుత్వ పాత్ర తగ్గిపోయింది. ప్రైవేటీకరణ జోరు అందుకొన్నది. దేశ, విదేశీ పరిశ్రమలు పెరగాలన్న పేరుతో పారిశ్రామికుల లాభాలపై పన్నురేట్లు బాగా తగ్గించారు. పైగా అనేక పన్ను రాయితీలు, ఇతర సదుపాయాలు కలుగజేశారు. ఆర్థిక విధానంలో పన్ను పడకుండా తప్పించుకొంటున్న నల్లధనం ఎక్కువయింది. ఈ కారణాలవల్ల కేంద్రప్రభుత్వ ఆదాయ వనరులు తగ్గాయి. ఖర్చులు పెరిగాయి. అభివృద్ధి పనులకు, అప్పులే మార్గమయ్యాయి.

విదేశీ ప్రత్యక్ష పరోక్ష పెట్టుబడులను ఆకర్షించాలనే పేరుతో వారికిచ్చే సదుపాయాలు పెరిగాయి. దేశ ఆర్థిక విధానం సంక్షోభంలో ఉంది.

ఈ కారణంతో పలు కేంద్ర ప్రభుత్వ పథకాలను రాష్ట్రాలకు బదలాయించడం వల్లనూ, రాష్ట్రాలకు వచ్చే పన్నుల వాటా తగ్గిపోవడంవల్లనూ రాష్ట్రాల ఆర్థిక పరిస్థితి అయోమయంగా తయారయింది. ఈ పరిస్థితులలో చిన్న రాష్ట్రాలు కేంద్రంపై వత్తిడి చేసే శక్తి కూడా తగ్గిపోయి, కేంద్రం పెట్టే భిక్షలకై ఎదురుతెన్నులు చూడవలసిన పరిస్థితి ఏర్పడుతోంది.

## దేశంలో చిన్నరాష్ట్రాలు లేవా?

చరిత్ర గమనంలో కొన్ని ప్రత్యేక కారణాలవల్ల దేశంలో చిన్న రాష్ట్రాలు ఏర్పడ్డాయి. మన దేశంలో జాతులు, తెగలు సమస్యలున్నాయి. దేశంలో దాదాపు 250 భాషలు మాట్లాడే వారున్నారు. ఇటీవల ఏర్పడ్డ మూడు కొత్త రాష్ట్రాలు చత్తీస్ ఘడ్, జార్ఖండ్, ఉత్తరాంచల్ రాష్ట్రాలు ఈ కారణాలతోనే ఏర్పడ్డాయి. ఈశాన్య ప్రాంతంలో నూతనంగా నాగాలాండ్ వగైరా రాష్ట్రాలు ఏర్పడ్డానికి కూడా ఇవే కారణాలు. అస్సాం నుండి బోడోలాండు వేరు గావాలని నేడు ఉద్యమం సాగుతూనే ఉంది.

లోగడ విదేశీయుల పాలనలో ఉండి స్వాతంత్ర్యం పొందిన పాండిచ్చేరి, గోవా వగైరా ప్రాంతాలు ప్రారంభములో కేంద్రపాలిత ప్రాంతాలుగా ఉండి, తరువాత రాష్ట్రస్థాయిని పొందాయి.

ఈ చిన్న రాష్ట్రాల ఆర్థిక, రాజకీయ పరిస్థితులేమిటో మనకు తెలుసు. ఈ రాష్ట్రాలలో జరుగుతున్న అభివృద్ధి ఏమిటి? ఇక రాజకీయ సుస్థిరత లేదు. అయారాం, గయారాంలతో తరచూ ప్రభుత్వాలు పడిపోవడం, కొత్తవి రావడం అవి మరల పడిపోవడం ఇదీ తంతు. చిన్న రాష్ట్రాలలో భూస్వాముల, పెట్టుబడిదారుల ప్రాబల్యం ఎక్కువ. శాసన సభ్యులనే కొనివేసి ప్రభుత్వాలను తారుమారు చేస్తారు. ఈనాడు రాష్ట్రాలలో చివరకు పార్లమెంట్ లో కూడా జరుగుతున్న తంతు ఇదే. ఈ విషయాలు ప్రత్యేక తెలంగాణా కోరేవారి దృష్టిలో ఉండనవసరం లేదా?

## ఇంతకీ ప్రత్యేక తెలంగాణా ప్రణాళిక ఏమిటి?

ప్రత్యేక తెలంగాణా వస్తే భూ సంస్కరణలు అమలు జరిగి పేదవారికి భూములు వస్తాయా? విద్య, వైద్య సౌకర్యాలు పెరిగే అవకాశముందా? నిరుద్యోగం పోతుందా? నీటి వనరుల అభివృద్ధికి ప్రాజెక్టుల నిర్మాణం జరుగుతుందా! వాటికీ, ఇలాంటి అభివృద్ధి కార్యక్రమాలకు డబ్బు ఎక్కడ

నుండి వస్తుంది? ప్రత్యేక తెలంగాణా కోరేవారు ప్రజలకు ఈ సమస్యలపై సమాధానాలు యివ్వవలసి వుంది.

**ప్రాంతీయ దురభిమానాలు రెచ్చగొట్టడం తేలిక:**

సోదర ప్రజల మధ్య ద్వేష భావాలు, వ్యతిరేకత, శత్రుత్వ భావాలు, ప్రాంతీయ దురభిమానాన్ని రెచ్చగొట్టడం అతి తేలిక. కాని తరువాత వచ్చే విష ఫలితాలు తీవ్రంగా ఉంటాయన్న విషయాన్ని ప్రత్యేక తెలంగాణా కోరుతున్న నాయకులు గ్రహిస్తున్నారా!

1969 లోనూ, 1972 ప్రత్యేక ఉద్యమాల కారణంగా రాష్ట్ర అభివృద్ధి ఎంత కుంటుపడిందో గుర్తుంచుకోవడం మంచిది.

**వెనుకబాటుతనం వేర్పాటు వాదానికి దారి తీయరాదు:**

తెలంగాణా ప్రాంతం, ఆంధ్ర ప్రాంతంలోని రాయలసీమ, ఉత్తరాంధ్ర, దక్షిణాంధ్రలో ప్రకాశం జిల్లాలాంటివి చాలా వెనుకబడి ఉన్న మాట నిజం. ఇందుకు బాధ్యత ఈ 45 సంవత్సరాలుగా రాష్ట్రాన్ని పరిపాలించిన కాంగ్రెసు, తెలుగుదేశం వహించవలసి వుంది. బూర్జువా, భూస్వామ్య ప్రభుత్వాల నైజం మనకు తెలియనిది కాదు. ఈనాడు భారతదేశంలోనున్న వివిధ రాష్ట్రాల మధ్య ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక, కళారంగాలలో పెరుగుతున్న అసమానతలను మనం చూస్తున్నాం. పరిపాలకుల ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించి, వాటిని ఓడించాలి. రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాల సత్వరాభివృద్ధికి, రాష్ట్ర సమతూకాభివృద్ధికి కట్టుబడి పనిచేసే ప్రభుత్వం వచ్చేందుకు కృషి చేయాలి.

తెలంగాణా, రాష్ట్రంలోని ఇతర వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక ప్రణాళిక, ప్రాంతీయ అభివృద్ధి బోర్డుల అవసరాన్ని పేర్కొంటూ, ప్రదేశ్ కమ్యూనిస్టు సమితి మన రాష్ట్ర ప్రజానీకం ముందు ఉంచిన పాకేజీ కార్యక్రమ ప్రాతిపదికగా సమైక్య ఉద్యమాన్ని నిర్మించడమే మన రాష్ట్రప్రజల ముందున్న తక్షణ కర్తవ్యం. ఇందుకు పూనుకుందాం. సమైక్య రాష్ట్రంలో సత్వర సమతూకాభివృద్ధిని సాధిద్దాం. అన్నదమ్ముల మధ్య సోదరభావమును పెంపొందిద్దాము.

**వై.వి. కృష్ణారావు**
విశాలాంధ్ర ప్రచురణాలయం
సంపాదకవర్గ కన్వీనర్.

హైదరాబాద్,
2001, సెప్టెంబరు 25.

# విషయసూచిక



* * *

# 1969
# ప్రత్యేక తెలంగాణా ఉద్యమం: కుటుంబ కలహానికి కారణం

1969 ప్రారంభంలో ప్రత్యేక తెలంగాణా ఉద్యమం తలెత్తినపుడు "ఆంధ్రప్రదేశ్ కుటుంబ కలహానికి కారణం" అను పేరిట శ్రీ చండ్ర రాజేశ్వరరావుగారు ఒక సుదీర్ఘ వ్యాసం రచించారు. కాంగ్రెస్ పాలకులు, నాయకులు ప్రాంతీయ అసమానతలు పోగొట్టటానికి తగు కృషి జరుపకపోవడమే ఈ ఉద్యమానికి ప్రధాన కారణమనీ, కాంగ్రెస్ పదవీ వ్యామోహంలో మురా తగవులతో రాష్ట్ర అభివృద్ధి పూర్తిగా నిర్లక్ష్యం చేయబడిందనీ, అందుచేత 1956 పెద్దమనుషుల ఒప్పందాన్ని పూర్తిగా అమలుపరచాలనీ, కమ్యూనిస్టులు, ప్రజాతంత్రవాదులు ఐక్యమై ఈ ప్రత్యేక ఉద్యమాన్ని ఎదుర్కోవాలనీ పిలుపు యిచ్చారు.

భారతదేశం యొక్క ఐక్యత, ప్రాదేశిక సమగ్రత, లౌకిక ప్రజాతంత్ర వ్యవస్థ భగ్నపరచబడే ప్రమాదం ముంచుకొచ్చింది. మత దురహంకారం, కులద్వేషం, భాషా దురభిమానం, ప్రాంతీయ విభేదాలు మొదలైన దుష్టశక్తులు కోరలు విప్పుకుని తాండవం చేస్తున్నాయి. ఈ విచ్ఛిన్నశక్తులను గుత్తపెట్టుబడిదారులు, భూస్వాములు, యితర అభివృద్ధి నిరోధక స్వార్థపర వర్గాలన్నీ అమానుషమైన జీవిత పరిస్థితులకు వ్యతిరేకంగా పోరాడుతూన్న ప్రజాసామాన్యం యొక్క ఐక్యతనూ, అనుదిన ప్రవర్థమానమైన ఉత్సాహాన్ని భగ్నంచేయడానికి ఉపయోగించుకుంటున్నారు.

కాని ఇటీవల ఆంధ్రప్రదేశ్‌లో ఒకే భాష మాట్లాడుతూ ఒకే సమష్టి సంస్కృతికి వారసులైన ప్రజా సమూహాల మధ్య రేగిన అంతఃకలహం మరో తరహాకు చెందినది. ఈ కలహం నుంచి తగిన గుణపాఠాలు నేర్చుకోకపోతే ప్రజాతంత్ర ఉద్యమం మొత్తంగా ప్రమాదంలో పడుతుంది.

మన దేశంలో భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణంకోసం జరిగిన పోరాటంలో ఆంధ్ర ప్రజలు అగ్రశ్రేణిలో నిలిచి పోరాడారు. ముక్కచెక్కలై చీలిపోయిన ఆంధ్రులందరినీ ఒక్క భాషాప్రయుక్త రాష్ట్రంలో ఏకం చేయడానికి, ఆంధ్రులందరూ నైజాం యొక్క భూస్వామ్య రాజరిక నిరంకుశపాలనకూ, బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు, కాంగ్రెస్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడారు. తత్ఫలితంగా 1953లో మొట్టమొదటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్ర ప్రాంతాలన్నిటినీ కలిపి పాక్షికమైన భాషాప్రయుక్త రాష్ట్రం యేర్పాటు చేయబడ్డది. తరువాత 1956లో నిజాం సంస్థానాన్ని విచ్ఛిత్తి చేయడం ద్వారా కేరళ, కర్ణాటక రాష్ట్రాలతోబాటు, ఆంధ్రప్రదేశ్ కూడా సంపూర్ణ భాషాప్రయుక్త రాష్ట్రంగా అవతరించింది. 12యేండ్ల తరువాత ఈనాడు విశాలాంధ్ర రాష్ట్రానికి మరల విచ్ఛిన్నతా ప్రమాదమేదురైంది.

ఈ ప్రమాదం అరికట్టబడకపోతే ఇలాగే ప్రాంతీయ అసమానతలూ, విచ్ఛిన్న ధోరణులూ తలెత్తి మహారాష్ట్ర, కర్ణాటక, గుజరాత్ రాష్ట్రాలకు కూడా ఎగ్రబాకవచ్చు. మహారాష్ట్ర యొక్క ఐక్యతకు భంగకరమైన ప్రత్యేక విదర్భ వివాదం యీపాటికే ప్రచారంలో వున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితి యెంత తీవ్రస్థాయికి చేరిందంటే, ఆంధ్ర ప్రాంతంనుంచి తెలంగాణా ప్రాంతానికి వలసవచ్చి స్థిరపడిపోయిన ఆంధ్ర ప్రాంతీయులను తెలంగాణాను విడిచి వెళ్ళమని బెదిరిస్తున్నారు. కొలదిచోట్ల వారి ఆస్తులను దోచివేయడమూ, వారి యిండ్లను తగులబెట్టడమూ జరిగింది. కొంతమందిని అవమానపరచడమూ, కొట్టడమూ జరిగింది. సుమారొక వెయ్యిమంది తెలంగాణా ప్రాంతంలోనివారు తమ యిళ్ళు, వాకిళ్ళను వదిలిపెట్టి ఆంధ్ర ప్రాంతానికి వెళ్ళిపోయినారు.

ఈ సందర్భంలోనే తెలంగాణా ప్రాంతీయులే ఆంధ్ర ప్రాంతీయులను అలాంటి దాడులనుంచి రక్షించిన ఉదాహరణలు కూడా అనేకం వున్నాయి. ఈ ఉప్పెనలోనే ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర వివాదం రేగింది.

## విచ్ఛిత్తి ప్రమాదం:

దీని ప్రతిధ్వనులు ఆంధ్ర ప్రాంతానికి కూడా యెగబ్రాకాయి. తెలంగాణా ప్రజలయొక్క న్యాయమైన కోర్కెలను తిరస్కరించే అనారోగ్య ధోరణులు పొడచూపినవి. అయితే తెలంగాణాలో జరిగిన అవమానకరమైన సంఘటనలుమాత్రం జరగలేదు.

పరిస్థితిలో వున్న విషాదమేమంటే– ఒక భాషా రాష్ట్రపు ఎల్లల్లో తెలుగు మాట్లాడే ప్రజలు ఒక ప్రాంతంవారికి మరో ప్రాంతంవారు పరాయివాళ్ళైనారు. తెలుగువాళ్ళు తెలుగు దేశంలోనే కాందిశీకులైనారు. భాషాప్రయుక్తం రాష్ట్రోందోళనలో అగ్రభాగాన నిలిచిన తెలుగు ప్రజల తెలుగు భాషా రాష్ట్రానికి విచ్ఛిత్తి ప్రమాద మావరించింది. ఈ రోజున ఆంధ్రప్రదేశ్‌లో పరిస్థితి తాత్కాలికంగా కొంత సర్దుకుంది. కాని సమస్యలు పరిష్కారం కాలేదు. ఉద్రిక్తతా ధోరణులు మరుగుతూనే వున్నాయి. ఇంతటి తీవ్రమైన పరిస్థితులకు దారితీసిన మూలకారణాలను తొలగించకపోతే పరిస్థితి ఏనాడైనా మరల రగుల్కొనవచ్చును. ఫలితంగా ఆంధ్రప్రదేశ్‌లోని ప్రజాస్వామిక ఉద్యమం విచ్ఛిన్నమౌతుంది. కాబట్టి సమస్యను శాశ్వతంగా పరిష్కరించి, ఆంధ్రప్రదేశ్ ప్రజల ఐక్యతను సుస్థిర పునాదులమీద ప్రతిష్టించాలంటే సమస్య మూలకారణమేదో అన్వేషించాలి.

క్లుప్తంలో చెప్పాలంటే యీ ప్రమాదకర పరిస్థితి ముంచెత్తుకు రావడానికి మూడు కారణాలున్నాయి.

## మూడు కారణాలు:

**ఒకటి:** ఆంధ్ర ప్రాంతంతో పోల్చితే తెలంగాణా ప్రాంతం ఆర్థికంగా వెనుకబడి యున్నది. కాగా, తెలంగాణా ప్రాంత ప్రజల కీయబడిన హామీలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అమలుజరపడంలో విఫలమైంది.

**రెండు:** గడచిన పన్నెండేళ్ళ కాలంలోనూ కాంగ్రెస్ సాగించిన దుష్పరిపాలన, కాంగ్రెస్ ఆంతరంగికంగా అధికారంకోసం మురా కుమ్ములాటలు బలసిపోవడం. మంత్రివర్గ పదవులు రాని మురా నాయకులు, తెలంగాణా ప్రజల యొక్క న్యాయమైన అసంతృప్తిని తమ స్వార్ధ ప్రయోజనాలకు ఉపయోగపెట్టుకోవడం.

**మూడు:** కాంగ్రెస్ దుష్పరిపాలనకూ, విచ్ఛిన్నకరమైన ప్రత్యేక రాష్ట్ర వాద ధోరణులకూ వ్యతిరేకంగా ప్రజలను సరియైన మార్గంలో నడిపించగల కమ్యూనిస్టు ఉద్యమమే ముక్కచెక్కలుగా చీలిపోయి వుండడము.

ఈ అంశాల నొక్కొక్కదానినే వివరంగా పరిశీలిద్దాం. భారతదేశం మొత్తంమీద చూసుకుంటే ఆంధ్రప్రదేశ్ వెనుకబడియున్న మాట వాస్తవమే. ఈ యిరవై యొక్క ఏండ్ల స్వతంత్ర పాలనలో ఎక్కువగా

పారిశ్రామికీకరణ జరగకపోవడంతో ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన ప్రాంతంగా మిగిలిపోయింది. కాని ఇలా వెనుకబడియున్న రాష్ట్రంలో తెలంగాణా ప్రాంతాన్ని మిగిలిన ప్రాంతంతో పోల్చితే యింకా వెనుకబడి యున్నది. ఈ సందర్భంలో ఆంధ్రప్రాంతమైనా సమంగా అభివృద్ధియైలేదు. రాయలసీమ జిల్లాలు, శ్రీకాకుళం, విశాఖపట్నం లాంటి ఉత్తరకోస్తా జిల్లాలూ వెనుకబడిన ప్రాంతాలే. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యొక్క ప్రణాళికా శాఖ సంపుటీకరించిన లెక్కలు యీ విషయాన్ని విశదపరుస్తాయి.

"కోస్తా జిల్లాలో తలసరి వ్యవసాయ ఉత్పత్తుల మొత్తపు విలువల సూచిక 120.5 వుంటే, తెలంగాణా జిల్లాలలో 84 మాత్రమే వుంది. రాయలసీమ జిల్లాలలో 95.0 వున్నది. తెలంగాణా జిల్లాలు రాయలసీమ జిల్లాలకన్నా కూడా తక్కువ ఉత్పత్తి చేస్తున్నవి. అక్షరాస్యత శాతం చూస్తే, మొత్తం జనాభా ప్రాతిపదికమీద కోస్తా జిల్లాలలో అక్షరాస్యత 134.9 శాతం.

రాయలసీమ జిల్లాల్లో 90%

తెలంగాణా జిల్లాల్లో 65.6%

## తలసరి ఆదాయాలు:

కోస్తా జిల్లాల్లో 292/- రూపాయలు

తెలంగాణాలో 188/ - రూపాయలు

జిల్లాలవారీగా పోలిస్తే

గుంటూరు జిల్లా రు. 336/ -

కృష్ణా జిల్లా రు. 302/ -

ఖమ్మం జిల్లా రు. 175/ -

వరంగల్ జిల్లా రు. 147/-

## ఆస్పత్రి పడకలు:

కోస్తా ఆంధ్రలో లక్ష జనాభాకు పడకల సరాసరి సంఖ్య 55.8, తెలంగాణాలో 18.6.

నూరు చదరపు మైళ్ళకు రోడ్డు మార్గాల నిడివి - కోస్తా జిల్లాలో 37 మైళ్ళు. తెలంగాణా జిల్లాలో 9 మైళ్ళు.

## 1956 ఒప్పందం:

తెలంగాణా ప్రాంతంయొక్క ప్రత్యేక పరిస్థితులను దృష్టిలో పెట్టుకునే 1956లో ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయంలో ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల నాయకులు తెలంగాణాకు రక్షణలను పొందుపరుస్తూ ఒక ఒడంబడికకు వచ్చారు. ఈ ఒడంబడికలో న్యాయశాస్త్ర రీత్యానూ, పరిపాలనావసర దృష్ట్యానూ ప్రభుత్వ చట్టంగా రూపొందవలసిన పై ముఖ్య అంశాలు 1956 ఆగస్టులో లోక్‌సభ ముందుకొచ్చినవి. ఆ ముఖ్యాంశాలీ క్రింద ఉదాహరిస్తున్నాను.

1. ఆంధ్రప్రాంతంలో వలె తెలంగాణాలో మద్య నిషేధం లేదు. కాబట్టి ప్రభుత్వాదాయంలో తెలంగాణా ప్రాంతపు లెక్కకు ఖర్చును మించి ఆదాయంలో మిగులు ఉంటుంది. ఈ మిగులును తెలంగాణా ప్రాంతాభివృద్ధికే వినియోగించాలి.

2. తెలంగాణా ప్రాంతంలోని కళాశాలలన్నిటిలోనూ సాంకేతిక విద్యాసంస్థలన్నిటిలోను కూడా ప్రవేశార్హత తెలంగాణా విద్యార్థులకు మాత్రమే పరిమితం చేయాలి. లేదా రాష్ట్రం మొత్తంమీద వుండే సీట్ల సంఖ్యలో మూడవ వంతును తెలంగాణా విద్యార్థులకు కేటాయించాలి. ఈ రెండు పద్ధతుల్లో ఏ పద్ధతి తెలంగాణా విద్యార్థుల కనుకూలమో ఆ పద్ధతిని అమలుపరచాలి.

3. రెండు ప్రాంతాలను విలీనం చేయడంవల్ల ఉద్యోగులను రిట్రెంచ్ చేయవలసివస్తే అది యిరు ప్రాంతాలలోనూ దామాషాన జరగాలి. భవిష్యత్తులో జరిగే ఉద్యోగ నియామకాలు రెండు ప్రాంతాల జనాభా ప్రాతిపదికమీద ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకు 2:1 నిష్పత్తిలో జరగాలి.

4. వ్యవసాయ భూముల అమ్మకం ప్రణాళిక, అభివృద్ధి, నీటిపారుదల మరి యితర విద్యుదుత్పాదక పథకాలూ సాధారణంగా ప్రణాళికలలోని పారిశ్రామికాభివృద్ధి, ప్రభుత్వ ఉద్యోగ నియామకాలూ ఈ విషయాల్లో తెలంగాణా ప్రాంతానికి సంబంధించి నంతమటుకు చట్టరీత్యా తెలంగాణా ప్రాంతీయ ప్రతినిధులతో ఏర్పాటుచేయబడిన రీజనల్ కౌన్సిల్ విచారించి నిర్ణయం చేస్తుంది.

వెనుకబడిన తెలంగాణాకు యిచ్చిన రక్షణలు అమలు జేయడం ద్వారా విశాలాంధ్ర సమైక్యతకు కృషి చేయాలని కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు చేసిన అనేక నిర్మాణాత్మక సూచనలు.

ఈ సందర్భంలో రీజనల్ కౌన్సిల్‌కూ రాష్ట్ర ప్రభుత్వానికీ అభిప్రాయభేదమొస్తే అంతిమ నిర్ణయంకొరకు కేంద్ర ప్రభుత్వానికి పంపాలి.

భారత రాజ్యంగ చట్టం 67(1) క్రింద భారత రిపబ్లిక్ అధ్యక్షులు జారీచేసిన ఉత్తర్వుతో తెలంగాణా ప్రాంతంనుంచి ఎన్నుకొనబడిన శాసనసభ, శాసనమండలి సభ్యులతో రీజనల్ కౌన్సిల్ ఏర్పాటైంది.

భారత రాజ్యాంగ చట్టం 16(3) ఆర్టికల్ ననుసరించి ప్రభుత్వ ఉద్యోగ నియామక (నివాసమునకు చెందిన ఆవశ్యకత) చట్టం 1957 పార్లమెంటుచేత ఆమోదించబడ్డది. ఈ చట్టం ఆంధ్రప్రదేశ్‌లో తెలంగాణా ప్రాంతానికీ, హిమాచల్ ప్రదేశ్‌కూ, మణిపూర్, త్రిపురలకూ వర్తిస్తుంది. ప్రభుత్వోద్యోగ నియామకాలలో తెలంగాణా ప్రాంతప్రజలయొక్క, పైన పేర్కొన్న మిగిలిన రాష్ట్రాల ప్రజలయొక్క ప్రయోజనాలను కాపాడటానికి ఈ చట్టం ఉద్దేశింపబడ్డది.

5. కాబినెట్ మంత్రుల్లో 60 శాతం ఆంధ్రప్రాంతానికి, 40 శాతం తెలంగాణా ప్రాంతానికీ చెందినవారుండాలి. తెలంగాణా ప్రాంతపు కాబినెట్ మంత్రులలో ఒకరు మహమ్మదీయులుండాలి.

ముఖ్యమంత్రి ఆంధ్ర ప్రాంతంవారైతే ఉప ముఖ్యమంత్రి తెలంగాణా ప్రాంతం వారు కావాలి. అలాగే ముఖ్యమంత్రి తెలంగాణా ప్రాంతంవారైతే ఉప ముఖ్యమంత్రి ఆంధ్రప్రాంతంవారై వుండాలి. హోం, ఫైనాన్స్, రెవెన్యూ, ప్రణాళిక – అభివృద్ధి, వాణిజ్యమూ – పరిశ్రమలూ, ఈ శాఖలలో ఏ రెండు శాఖలైన తెలంగాణా మంత్రులకివ్వాలి.

6. ప్రస్తుతం తెలంగాణా ప్రాంతంలో పరిపాలనా, న్యాయ నిర్వహణ శాఖల్లో ఉర్దూకు గల స్థానాన్ని ఐదేళ్ళ వరకూ కొనసాగించాలి. తరువాత రీజనల్ కౌన్సిల్ పరిస్థితిని సమీక్షించాలి.

ఇక ఉద్యోగ నియామకాలకు సంబంధించినంతవరకు నియామక సమయంలో తెలుగులో పరిజ్ఞానముండాలని పట్టుదల చేయకూడదు. అయితే, నియామకం జరిగిన తరువాత రెండేళ్ళ లోపల నిర్ణీతమైన తెలుగు పరీక్షల్లో ఉత్తీర్ణులు కావాలని కోరవచ్చును.

## భావ సమైక్యతకు పునాది:

7. ఈ లోపల పరస్పరాంగీకారంతో మార్పుచేస్తేనే తప్ప ఈ ఏర్పాటు పదియేండ్లు కొనసాగాలి. ఆంధ్రప్రదేశ్ యొక్క రెండు ప్రాంతాల మధ్య

జరిగిన ఈ ఒప్పందం తెలంగాణా ప్రాంత ప్రజల భయాందోళనలను తొలగించడానికీ, కాలక్రమంలో యిరుప్రాంతాల మధ్య భావసమైక్యతను సాధించడానికి తీసుకోబడ్డ సరియైన చర్య. ఈ ఒడంబడికను చిత్తశుద్ధిగా ఆచరణలో పెట్టినట్లైతే ఈనాడు రాష్ట్రాన్ని ఆవరించిన కుటుంబ కలహం నివారించబడి యుండేది. గత పన్నెండేండ్లుగా ఆంధ్రప్రదేశ్‌ను అవిచ్ఛిన్నంగా పరిపాలించిన కాంగ్రెస్ పార్టీయే నేడు ఆంధ్రప్రదేశ్ ప్రజలకు కలిగిన ఈ దుస్థితికి పూర్తి బాధ్యత వహించాలి. ఒకటి తరువాత ఒకటిగా వరుసగా అధికారంలోకొచ్చిన కాంగ్రెస్ మంత్రివర్గాలు భూస్వామ్య వర్గాల ప్రాబల్యం క్రింద నడుస్తూ, రాష్ట్రాన్ని శిధిలావస్థకూ, ఆర్థికంగా దివాలా స్థితికీ తీసుకొచ్చినవి. రిజర్వు బ్యాంకు కూడా చిల్లిగవ్వ ఓవర్ డ్రాఫ్టు యివ్వ నిరాకరించింది.

ఆంధ్రప్రదేశ్ భాషాప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సమయంలో యిరు ప్రాంతాల నాయకులూ మనఃపూర్వకంగా చేసుకున్న ఒడంబడికను ఈ మంత్రివర్గాలు అమలుపరచలేదు. తెలంగాణా ప్రజల్లో పెచ్చరిల్లిన అసంతృప్తికి యిదే ప్రధాన కారణం. మంత్రివర్గంలో స్థానాలు సంపాదించుకోలేని తెలంగాణా కాంగ్రెస్ నాయకుల ముఠా ఒకటీ యితర విచ్ఛిన్నకర వర్గాలూ తమ స్వార్థ ప్రయోజనాలకోసం ఈ అసంతృప్తిని వినియోగించుకున్నారు.

ఈ ఉభయ ప్రాంత నాయకుల మధ్య ఒప్పందంలో తెలంగాణా మిగులు నిధులు తెలంగాణా అభివృద్ధికే ఖర్చుచేయాలి అనే మొదటి అంశం ఏమీ నీతినియమం లేకుండా ఉల్లంఘించబడ్డది. రాష్ట్ర ప్రభుత్వం 1968–69 బడ్జెట్‌లో మిగులుగా చూపిన 45 కోట్ల 20 లక్షల రూపాయల మొత్తంలో నుంచి 39 కోట్ల 55 లక్షల రూపాయల మొత్తాన్ని ఆంధ్రప్రాంతంలో ఖర్చు చేసింది. అదే సమయంలో తెలంగాణా ప్రాంతానికే సంపూర్ణంగా ఉపయోగపడగల ఒకే ఒక భారీ నీటిపారుదల ప్రాజెక్టయిన పోచంపాడు ప్రాజెక్టుకు 1964లోనే ప్రణాళికా సంఘం యొక్క అనుమతి లభించినప్పటికీ దాని పని మాత్రం నిధుల కొరత పేరుతో నత్తనడక నడుస్తున్నది. తెలంగాణా మిగులు నిధులను ఈ ప్రాజెక్టు నిర్మాణంలో ఉపయోగించి వున్నట్లయితే అది ఈపాటికి పూర్తయి వుండేది.

మరో ముఖ్యమైన ఉదాహరణ: తెలంగాణా ప్రాంతమంతటా మోట బావులు చాలా వున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో విద్యుదీకరణ విస్తరించి ఈ మోటబావులన్నిటికీ ఎలక్ట్రిసిటీ సప్లయ్ చేసి వున్నట్లయితే,

వ్యవసాయోత్పత్తి ఎంతో పెరిగిపోయేది. తెలంగాణా రైతుల కెంతో మేలు కలిగేది. తెలంగాణా రైతులు ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి మోటలు, ఏతములూ, గూడలూ లాంటి పాతకాలపు సాధనాల సహాయంతోనే నీరు కట్టుకుంటూ, ఒకే పొలములో రెండు మూడు వరి పంటలు పండిస్తున్నారు అని పై ప్రాంతంవాళ్ళు తెలుసుకుంటే ఆశ్చర్యపడతారు. రైతులు ఎలక్ట్రిసిటీ కావాలని గోడుపెడ్తున్నారు. కాని చేసింది స్వల్పం. ఎందుకూ అంటే డబ్బు కొరత అన్నారు. పోచంపాడు ప్రాజెక్టు నిర్మాణమూ, గ్రామీణ ప్రాంత విద్యుదీకరణ తెలంగాణా రైతాంగానికి ఎంతో సహాయపడతాయి.

తెలంగాణా ప్రాంతీయుల మనస్తాపానికి రెండవ కారణం ఉపాధి కల్పన ఉద్యోగ నియామకాలకు సంబంధించినది. మొదటి రోజుల్లో తెలంగాణాకు కేటాయించిన ఉద్యోగాలన్నిటికీ సరిపడినంతగా ఉద్యోగార్హతగల అభ్యర్థులు లేకపోవడం నిజమే కాని గడచిన పదిహేనేళ్ళలో అనేక కళాశాలలూ, హైస్కూళ్ళు స్థాపించబడ్డవి. ఉద్యోగార్హతలు కలిగిన అభ్యర్థులెంతోమంది తెలంగాణా ప్రాంతీయుల నుంచి తయారై ఉంటారు. కాని ఏదో ఒక సాకుతో "భర్త తెలంగాణాలో ఉద్యోగి. కాబట్టి భార్యకు కూడా తెలంగాణాలోనే ఉద్యోగమివ్వాలి" లేదా "భార్య తెలంగాణాలో ఉద్యోగి కాబట్టి భర్తకూ అక్కడే ఉద్యోగమివ్వాలి" అనేలాంటి సాకులతో చాలామంది ఆంధ్ర ప్రాంతీయులకు తెలంగాణాలో ఉద్యోగాలు చూపబడినవి. గవర్నమెంటు సమాచారం ప్రకారమే తెలంగాణా అభ్యర్థుల హక్కులను త్రోసేసి ఆంధ్ర ప్రాంతీయులకు ఉద్యోగాలిచ్చిన కేసులు 1700 దాకా ఉన్నవి. ఇవికాక ఆంధ్ర ప్రాంతీయులు తామూ తెలంగాణా ప్రాంతీయులమేనని దొంగ 'ముల్కీ' సర్టిఫికెట్లు సంపాదించుకుని తెలంగాణా ప్రాంతంలో ప్రభుత్వోద్యోగాలు పొందినవాళ్ళు చాలామంది వున్నారు.

ఇకను రాష్ట్ర కేంద్ర సర్వీసుల్లోనూ, ఉన్నతశ్రేణి ఉద్యోగాల్లోనూ, అదనంగా ఉన్న ఉద్యోగుల్ని రిట్రెంచిమెంటు చేయడంలోనూ, ప్రభుత్వ గృహాలు కేటాయించడంలోను ఇలా యింకా అనేక విషయాల్లో తెలంగాణా ప్రాంతీయులకు అన్యాయం జరుగుతూ ఉన్నది.

## ఉప ముఖ్యమంత్రి పదవి:

ఒడంబడికలో మరో ముఖ్యమైన అంశం రాష్ట్ర మంత్రివర్గ సంకలనం. రాష్ట్ర ప్రభుత్వ కేబినెట్‌ను నిర్మించడంలోనూ, పరిపాలనా శాఖలు

కేటాయించడంలోనూ, ఒడంబడికలో నిర్దేశించిన నిష్పత్తిని పాటించిన మాట నిజమే. కాని ముఖ్యమంత్రి, ఉప ముఖ్యమంత్రుల పదవులను కేటాయించడంలో మాత్రం ఒడంబడికను ఖచ్చితంగా పాటించలేదని చెప్పాలి. మొదట్లో ఒక తెలంగాణా వ్యక్తికి ఉప ముఖ్యమంత్రి పదవి యివ్వడం జరిగింది. కాని తరువాత ఈ పదవిని భర్తీ చేయకుండా సాచివేతతో పూర్తిగా వదలివేయబడ్డది. ఆంధ్రప్రదేశ్ యేర్పడ్డప్పటినుంచీ వచ్చిన ముగ్గురు ముఖ్యమంత్రులూ ఆంధ్ర ప్రాంతీయులే. తెలంగాణా ప్రాంతీయుని కొక్కనికీ ముఖ్యమంత్రి పదవి దక్కలేదు. అలాగే ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్ లాంటి ఉన్నత పదవులు కూడా. ఒక్కసారికి మాత్రం స్వల్పకాలికంగా తెలంగాణా ప్రాంతీయుడు పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ పదవిలో పనిచేశాడు. ఇదికూడా అంత ప్రధానమైనది కాకపోయినా తెలంగాణా ప్రాంతీయ విద్యాధికుల్లో న్యూనతాభావానికీ, మనోవ్యధకూ కారణమైన విషయమే.

ఇంతా చెబుతుంటే సకల ప్రాంత సమీకృతమైన సమగ్ర ఆంధ్ర రాష్ట్రం యేర్పడ్డందువల్ల తెలంగాణాకేమీ మేలు జరగలేదంటున్నామని అర్థం చేసుకోకూడదు.

20 జిల్లాలకు కేంద్రంగా, ఆంధ్రప్రదేశ్ ముఖ్య పట్టణంగా హైదరాబాద్ నగరం విస్తృతంగా పెరిగిపోయింది. వ్యాపారస్తులూ, సినిమా ప్రొడ్యూసర్లూ, చిన్న పరిశ్రమదారులూ, వ్యవసాయ నిపుణత కలిగిన రైతులూ చాలామంది హైదరాబాద్ నగరానికీ, తత్పరిసర ప్రాంతాలకూ వలసవచ్చి స్థిరపడ్డారు. సినిమా స్టుడియోలనూ, ద్రాక్ష తోటలనూ, చిన్న చిన్న పరిశ్రమలనూ స్థాపించి నగరానికి నూతన జీవనమునూ, నూతన శోభను చేకూర్చారు.

రాష్ట్రేతర ప్రాంతాల నుంచి కళాకారులూ, విద్యామేధస్సంపన్నులూ అనేకమంది నగరానికాకర్షించబడుతున్నారు.

ఆంధ్రప్రదేశ్ నిర్మాణం తరువాత కీలకమైన ప్రభుత్వరంగ పరిశ్రమలు కూడా కొద్దిగా స్థాపించబడ్డాయి. హైదరాబాద్ నగరం ఆంధ్ర ప్రజలందరికీ రాజకీయ కేంద్రంగానే కాక, సాంస్కృతిక కేంద్రంగాను, పారిశ్రామిక కేంద్రంగాను అభివృద్ధి అయింది. తమ చరిత్రలో మొట్టమొదటిసారిగా తమదియని ఇలాంటి కేంద్రం లేకపోవడంవల్ల ఆంధ్రుల సర్వతోముఖ వికాసం ఇంతవరకూ అరికట్టబడ్డది.

## వలసవెళ్ళిన రైతులు:

ఆంధ్ర ప్రాంతంలో అభివృద్ధిచెందిన నాల్గు డెల్టా జిల్లాల నుండి సామాన్య రైతులు కూడా తమకున్న కొద్దిపాటి భూములనూ, ఇళ్ళనూ, ఉన్న సర్వస్వమూ అమ్ముకుని మైసూరు, ఒరిస్సా రాష్ట్రాలలోనూ, రాయలసీమలోనూ కొత్తగా ప్రాజెక్టులు కట్టిన ప్రాంతాలకు వలస వెళ్ళారు. అట్లాగే అలాంటి రైతులు తెలంగాణా ప్రాంతానికి కూడా వలస వచ్చారు. ఇలా వలస రావడం నిజానికి ఆంధ్రప్రదేశ్ యేర్పడటానికి చాలా ముందునుంచే ప్రారంభమైనప్పటికీ, ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డ తరువాత యింకా ఎక్కువైంది. వలస వచ్చిన తరువాత ఈ రైతుల పరిస్థితి కొంత బాగుపడింది. కేంద్ర ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్‌కు న్యాయమైనంత స్థాయిలో పారిశ్రామికీకరణ జరగనీయక పోయినప్పటికీ ఆంధ్రప్రదేశ్ భాషాప్రయుక్త రాష్ట్రం యేర్పడ్డం వల్ల మొత్తం ఆంధ్రప్రజలందరూ ఇరు ప్రాంతాలవారూ కూడా మేలు పొందారు. కాని పైన పేర్కొన్న ఒడంబడికను అమలుచేయనందువల్లనూ, తత్ఫలితంగా ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలవారి మధ్య వైమనస్యమూ, అంతరంగికమైన స్పర్ధా ఏర్పడ్డం వల్లనూ తప్పితే ఆంధ్ర ప్రజల భావ సమైక్యత సమరసంగా జరిగిపోయేది. కాంగ్రెస్ ప్రభుత్వం యొక్క ప్రజావ్యతిరేక విధానాలవల్ల ప్రజల జీవిత పరిస్థితులు నానాట అధ్వాన్నమై, పుట్టిన అసంతృప్తిని ఏకీకృతం చేసి, ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ఐక్యపోరాటంగా రూపొందించడం సాధ్యపడేది.

ఈ దురదృష్టకరమైన పరిస్థితిని మంత్రివర్గంలో స్థానాలు దొరకని కొంతమంది తెలంగాణా నాయకులు తమ స్వార్థప్రయోజనాల కుపయోగించుకున్నారు. ఆంధ్రప్రాంత ప్రజలకు వ్యతిరేకంగా జ్వాలలను క్రమపద్ధతిలో రగిల్చారు. దహనాలనూ, లూటీలనూ రెచ్చగొట్టారు. ధ్వంసకాండతో తెలుగు ప్రజలకున్న మంచిపేరును మాలిన్యం చేశారు. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నినాదం కూడా తలెత్తింది. పాలకులలో కొంతమంది నిజానికి ఆంధ్రప్రదేశ్ నిర్మాణాన్నే వ్యతిరేకించారు. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడటం వారికి ఇష్టపడలేదు.

ఈ సందర్భంలో ఆంధ్ర ప్రాంతంలో కూడా పదవులు దొరకని కాంగ్రెస్ నాయకులూ, యితరులూ వెనుకబడలేదు. తెలంగాణాలో అసహ్యాకరమైన సంఘటనలు జరిగినప్పుడు వారు కూడా ఆ ఆందోళనను అందిపుచ్చుకున్నారు. తమ స్వార్థప్రయోజనాలను సాధించుకోడానికి

విచ్ఛిన్న ధోరణులను రెచ్చగొట్టి ఉభయ ప్రాంతాల ఐక్యతకు పునాది అయిన ఒడంబడికనే రద్దు చేయాలనే నినాదం లేవదీశారు. ఈ ప్రతీకారాందోళనకు విద్యార్థులను ఉపయోగపెట్టుకున్నారు.

## ఇరు ప్రాంతాల్లోని స్వార్థపర వర్గాల పాత్ర

ఈ విధంగా యిరు ప్రాంతాలలోను పదవీచ్యుతులైన కాంగ్రెస్ నాయకులు రెండు కొసల నుండి బయలుదేరి ఒకే పనిని– సమగ్ర ఆంధ్రప్రదేశ్ యొక్క ఐక్యతకు ప్రమాదం కలుగజేయడం– నిర్వర్తించబూనుకున్నారు.

ఆంధ్రప్రదేశ్‌ను మరల ముక్కలు ముక్కచెక్కలు చేసి విచ్ఛిన్నశక్తులకు వ్యతిరేకంగా పోరాడి ప్రజలను సరియైన మార్గంలో నడిపించగల కమ్యూనిస్టు ఉద్యమం మూడు పార్టీలుగా ముక్కలైపోయింది. ఇకను రాష్ట్రంలో చెప్పుకోదగిన వామపక్షపార్టీలా లేవు. పూర్వం కమ్యూనిస్టు ఉద్యమం చాలా బలంగా ఉండి కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయ శక్తిగా పరిగణించబడేది. నైజాం పాలనకూ, ఫ్యూడల్ వర్గాలకూ వ్యతిరేకంగా సమగ్ర ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నిర్మాణం కొరకు జరిగిన పోరాటంలో కమ్యూనిస్టు ఉద్యమం అగ్రశ్రేణిలో నిల్చి ప్రధానమైన పాత్రను నిర్వహించింది. 1964లో కమ్యూనిస్టు ఉద్యమం రెండు సమ భాగాలుగా, అంటే భారత కమ్యూనిస్టు పార్టీ, మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీలుగా చీలింది. తరువాత 1968లో మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ మరల రివల్యూషనరీ కమ్యూనిస్టులని, మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ అనీ రెండుగా చీలింది. కమ్యూనిస్టు ఉద్యమంలో యేర్పడ్డ యీ చీలిక ఆంధ్రప్రదేశ్ ప్రజా ఉద్యమానికి హాని కలిగించింది.

## కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత- శుభసూచన:

20 యేండ్ల కాంగ్రెస్ దుష్పరిపాలనలో భూస్వాములూ, నూతన ధనిక వర్గాలూ, కాంగ్రెస్ పార్టీ మరి యితర అభివృద్ధి నిరోధక శక్తులూ కమ్యూనిస్టు ఉద్యమాన్ని యింకా బలహీనపరచడానికీ, ప్రజలను విచ్ఛిన్న మార్గాలలో నడపడానికి కమ్యూనిస్టు ఉద్యమంలోని చీలికలను ఉపయోగించుకున్నారు. ఈ విచ్ఛిన్నకర శక్తులకు వ్యతిరేకంగా పోరాడటానికి ముఖ్యావసరమైన సాధనం కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత. కనీసం యింత ఆలస్యంగానైనా రాష్ట్రంలోని రెండు కమ్యూనిస్టు పార్టీలు – భారత

కమ్యూనిస్టు పార్టీ, మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ – ఈ సందర్భంలో రాష్ట్ర విచ్ఛిత్తికి దారితీసే ధోరణులకు వ్యతిరేకంగా ఐక్యాందోళనను సాగించుతూండటం అభినందించదగిన విషయం.

## మార్గం ఏమిటి?

ఆంధ్రప్రదేశ్ ఐక్యతకూ, ప్రజాతంత్ర ఉద్యమానికి ఈనాడు వాటిల్లిన ప్రమాదాన్ని నివారించే మార్గమేమిటి?

1956 నాటి ఒడంబడికనూ, ఆ ఒడంబడికను అమలుజరపడానికి తీసుకోవలసిన ప్రత్యక్ష చర్యలను వివరంగా పొందుపరచిన 19 జనవరి 1969 అఖిలపక్ష ఒప్పందాన్ని చిత్తశుద్ధితో అమలుజరపడం ఒక్కటే పరిష్కారమవుతుంది.

ఈ జనవరి 19 అఖిలపక్ష ఒప్పందం ప్రకారం ఈ తేదీవరకూ నిలవదేలిన తెలంగాణా మిగులు నిధులను అంచనా గట్టడానికి భారత కంట్రోలర్ ఆడిటర్ జనరల్ చేత నియమింపడిన అక్కౌంటెంటు జనరల్ హోదా గలిగిన ఉన్నతోద్యోగిని నియమించాలి. ఈ ఉద్యోగిచేత అంచనా కట్టబడిన తెలంగాణా మిగులు నిధులను రాగల ఐదేండ్లలో తెలంగాణా అభివృద్ధికై వినియోగించాలి. భవిష్యత్తులో ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం నిలవదేలబోయే తెలంగాణా మిగులు నిధిని ఆ తరువాత సంవత్సరంలో తెలంగాణా ప్రాంతానికై వినియోగిస్తుండాలి.

తెలంగాణా, ప్రాంతీయులకు కేటాయించబడిన ప్రభుత్వ ఉద్యోగాల్లోనూ, స్థానిక సంస్థల ఉద్యోగాల్లోనూ, యితర అనుబంధ సంస్థల ఉద్యోగాల్లోనూ నియమించబడిన ఆంధ్ర ప్రాంతీయులను వెంటనే తొలగించి, ఆ స్థానాల్లో అర్హతగల తెలంగాణా ప్రాంతీయులను నియమించాలి. అలా తొలగించబడిన ఆంధ్ర ప్రాంతీయులకు ఆంధ్రప్రాంతంలో ఉద్యోగాలు చూపాలి.

ఇక ప్రభుత్వ సచివాలయంలో పనిచేసే గవర్నమెంటు ఆఫీసర్ల్లా, సమష్టి పదవులలో వుండే ఆఫీసర్ల విషయంలో తెలంగాణా ప్రాంతీయులైన ఆఫీసర్లకూ, ఉద్యోగులకూ ప్రమోషన్లలో, యితరత్రాను అన్యాయం జరగ కుండేందుకుగాను ఇంటిగ్రేటెడ్ సీనియారిటీ లిస్టులను తయారుచేయాలి.

ఈ ఒప్పందాలను అమలుపరిచే విషయంలో ఒక ముఖ్యాంశాన్ని గుర్తుంచుకోవాలి. కాంగ్రెస్ మంత్రివర్గం యొక్క లోపభూయిష్టమైన

పద్ధతివల్లనైతేనేమి, కేంద్ర ప్రభుత్వం సవతితల్లి ప్రేమతో చిన్నచూపు చూచినందువల్లనైతేనేమి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యొక్క ప్రస్తుత ఆర్థిక స్థితిగతులు చూస్తే దివాలాలో ఉన్నవి. అందువల్ల తెలంగాణా మిగులు నిధి బాకీలను చెల్లించవలసి వస్తే అదే సమయంలో ఆంధ్ర ప్రాంతంలో మద్య నిషేధాన్ని రద్దుచేయడం అవసరం. అలా చేస్తే ప్రతి సంవత్సరం దాదాపు 25 కోట్ల రూపాయలు అదనపు ఆదాయం వస్తుంది. కేంద్ర ప్రభుత్వం కూడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ క్లిష్ట పరస్థితుల నుంచి బయటపడటానికి ఉదారంగా ఆర్థిక సహాయం చేయాలి.

మద్య నిషేధాన్ని రద్దుచేయడమంటే నైతిక ప్రాతిపదికమీద అభ్యంతరాలను లేవదీయవచ్చును. ఆంధ్ర ప్రాంతంలోనూ, అలాగే మద్య నిషేధమున్న యితర రాష్ట్రాల్లోనూ దొంగ సారా తయారీ ఒక గృహపరిశ్రమగా ఏర్పడి విపరీతమైన అవినీతి, లంచగొండితనాలకూ, ప్రజల ఆరోగ్య క్షీణానికి కారణమౌతున్నప్పుడు మద్య నిషేధం యొక్క నైతిక విలువల ప్రసక్తి అర్థరహితమైనది. ఇటీవల కేరళ, మైసూరు, మధ్యప్రదేశ్ ప్రభుత్వాలు మద్య నిషేధాన్ని రద్దు చేశాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మట్టుకు ఈ ఊబి నుంచి బయటపడటానికి మద్య నిషేధాన్ని యెందుకు రద్దు చేయకూడదు? మరో మార్గం మాత్రం ఏమున్నది?

కాంగ్రెస్ దుష్పరిపాలనను గురించీ, వారి మురాకోరు విధానాలవల్ల కలిగిన దురదృష్టకర ఫలితాలను గురించీ బ్రహ్మాండమైన ఆందోళనను కొనసాగించాలి. ఈ అంతరంగిక కుటుంబ కలహాలవల్ల ఆంధ్రప్రదేశ్ యొక్క సర్వతోముఖాభివృద్ధి ఏ విధంగా తిరోముఖం పట్టిందీ, అభివృద్ధి నిరోధక భూస్వామ్య శక్తులూ, నూతన ధనిక వర్గాలూ, యితర స్వార్థపర వర్గాలూ యెలా ప్రాబల్యంలోకి వచ్చి ప్రజల జీవన పరిస్థితులను మెరుగుపర్చడానికి జరిగే ప్రజా ఉద్యమాలను బలహీనపరిచిందీ ప్రజలకు వివరించాలి. అభివృద్ధి నిరోధక విచ్ఛిన్న శక్తుల దాడిని సకల సాధనాలనూ ప్రయోగించి తిప్పికొట్టాలి. ప్రజల ఐక్యతనూ, ఆంధ్ర దేశ్ యొక్క సమగ్రతనూ, ప్రజాతంత్ర ఉద్యమాభివృద్ధిని సాధించాలి. కమ్యూనిస్టు ఉద్యమాన్ని రక్షించాలి. కమ్యూనిస్టు ఉద్యమం ఐక్యమై యితర ప్రజాతంత్ర శక్తులనూ, వర్గాలనూ కలుపుకొని ఐక్యాందోళన సాగించినట్లైతే ఈ అభివృద్ధి నిరోధక విచ్ఛిన్నకర దుష్టశక్తుల దాడిని ఓడించగలం.

ఈ వ్యాసం ముగించే ముందు ఆంధ్రప్రదేశ్ ప్రజలకొక్క విషయం గమనికలోకి తేవాలి. తెలుగు ప్రజలు అసంఖ్యాకులుగా వలస వెళ్ళి

నివసిస్తూన్న యితర రాష్ట్రాల్లో కూడా ఈ విచ్ఛిన్న శక్తులే ప్రాబల్యంలోకొస్తే ఏం జరుగుతుందో ఊహించాలి. 1961 జనాభా లెక్కల ప్రకారం తమిళనాడులో 33 లక్షల 50 వేలూ, కర్నాటకలో 20 లక్షలూ, ఒరిస్సాలో 4 లక్షలూ, మహారాష్ట్రలో 6 లక్షల 50 వేలూ, పశ్చిమ బెంగాల్లో 80 వేలూ, మధ్యప్రదేశ్‌లో 60 వేలూ తెలుగు మాట్లాడే ప్రజలు వున్నారు. మొత్తం 65 లక్షల మంది తెలుగు ప్రజలు యితర రాష్ట్రాల్లో జీవిస్తున్నారు. మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలో ఉండే తెలుగువాళ్లు తెలంగాణా నుంచి వలస వెళ్ళినవారు. మిగిలినవాళ్ళు ఆంధ్ర ప్రాంతం నుంచి వలస పోయినవాళ్ళు.

మన దేశం యొక్క ఐక్యత కాపాడబడాలంటే ఈ సంకుచిత మనస్కతా ధోరణినీ, విచ్ఛిన్న ధోరణినీ యెదుర్కొని పోరాడి, నిశ్శేషంగా తుడిచిపెట్టాలి.

*– మార్చి 9, 1969, విశాలాంధ్ర.*

* * *

# 1973
# ఆంధ్రప్రదేశ్‌ను విభజించినట్లయితే దేశమంతా విచ్ఛిన్నంకాగల ప్రమాదం

## వేర్పాటువాద ఉద్యమంలో గల ప్రమాదాలు

ఆంధ్రప్రదేశ్‌లో వేర్పాటు ఉద్యమ సంక్షోభం ఫలితంగా ఉత్పన్నమైన ప్రమాదకర పరిణామాలు రోజు రోజుకీ స్పష్టం అవుతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో సంభవిస్తున్న పరిణామాలపట్ల మన దేశంలోని ప్రాంతీయ దురహంకార శక్తులు, అభివృద్ధి నిరోధక వర్గాలు సంతోషం వ్యక్తం చేయడమే కాకుండా, మరింత బిగ్గరగా అరుస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌ను వెంటనే విభజించవలసిందిగా వారు కోరుతున్నారు. రాష్ట్ర విభజనకు అంగీకరించనివారు కూడా కొందరు వున్నారు. కాని, ప్రస్తుత తీవ్ర పరిస్థితుల్లో మార్గాంతరం లేదనే దృష్టితో వారు తమ అభిప్రాయాన్ని మార్చుకుని రాష్ట్ర విభజనను బలపరుస్తున్నారు.

జనసంఘం రాష్ట్ర విభజనను కోరుతూ బయటపడింది. ప్రత్యేక తెలంగాణా ఆందోళన సందర్భంగా 1969లో జనసంఘ్ "రాష్ట్రాల పునర్విభజనకు రెండవ కమిషన్" ఏర్పాటుచెయ్యవలసిందిగా యిచ్చిన పాత నినాదాన్నే ముందుకు తెచ్చింది.

### దేశాన్ని సంక్షోభంలో ముంచే యత్నం:

ప్రస్తుతం వున్న రాష్ట్రాలన్నింటినీ విభజించి, దేశాన్ని సంక్షోభంలో ముంచెత్తడమే వివాదంలోని అంతరార్థం. భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటును

ప్రశ్నిస్తాను, ప్రజాతంత్ర పద్ధతులలో ఏర్పడిన ఆ రాష్ట్రాలను తిరిగి విభజించవలసిందిగా కోరుతూను, బడా పెట్టుబడిదారీ పత్రికలలో వ్యాసాలను ప్రకటిస్తున్నారు. అయితే యీ విధంగా వ్యాసాలు ప్రచురించడం కొత్తేమీ కాదు. భాషా సంబంధమైన, ప్రాంతీయమైన వివాదాలు ఏర్పడినప్పుడల్లా యీ సమస్యను లేవనెత్తి, భాషాప్రయుక్త రాష్ట్రాల స్థానంలో ఉమ్మడి రాష్ట్రాలను ఏర్పాటుచేయటం పరిష్కారమార్గమని తెలియజేస్తున్నారు. మౌలికమైన యీ సమస్యను వివరించడానికి ముందు, ఆంధ్రప్రదేశ్ విభజన బలపరుస్తూ చేస్తున్న కొన్ని వాదనలకు సమాధానం చెప్పవలసి వుంది.

## కొన్ని కుంటి వాదనలు:

పాత పంజాబు రాష్ట్రాన్ని పంజాబు, హర్యానా రాష్ట్రాలుగా విభజించిన దృష్ట్యా ఆంధ్రప్రదేశ్‌ను విభజించడానికి అభ్యంతరం ఎందుకని కొందరు ప్రశ్నిస్తున్నారు. అదేవిధంగా అస్సాం రాష్ట్రం నుండి కచార్ ప్రాంతాన్ని విభజించడం న్యాయమని భావించినప్పుడు, ఆంధ్ర ప్రాంతాన్ని ఎందుకు విభజించరాదని మరికొందరి వాదన. పై రాష్ట్రాల విభజనలో భాషాపరమైన సమస్య ఇమిడివున్న దృష్ట్యా, వాటి విభజన సమంజసమే కాని, ఆంధ్రప్రదేశ్ విషయంలో మాత్రం ఆ సమస్య ఏమీ లేదు. ఉభయ ప్రాంతాల ప్రజలు ఒకే భాష మాట్లాడుతున్నారు. ఉభయ ప్రాంతాలలోను ఒకే సంస్కృతి వుంది. పాత పంజాబు రాష్ట్రంలో పంజాబీ, హిందీ రెండు భాషలు మాట్లాడే రెండు ప్రత్యేక ప్రాంతాలలో వున్న ప్రజలు భాషా ప్రాతిపదికపై రాష్ట్రాన్ని విభజించవలసిందిగా డిమాండ్ చేయడంతో పంజాబు; హర్యానాలుగా విభజించబడింది.

మన దేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు క్రమంలో రాష్ట్ర విభజన చిట్టచివరిది. భాషాప్రయుక్త రాష్ట్రాల సిద్ధాంతానికి అనుగుణంగానే యీ ఏర్పాటు జరిగింది.

## కచార్ సమస్య:

కచార్ ప్రాంత విషయం. ఈ ప్రాంతంలో అత్యధిక సంఖ్యాక ప్రజలు బెంగాలీ భాష మాట్లాడేవారు. అయితే, కొన్ని చారిత్రక కారణాలవల్ల యీ ప్రాంతాన్ని అస్సాం రాష్ట్రంతో కలిపివుంచడం జరిగింది.

కొన్ని జిల్లాలలోని తెలుగు మాట్లాడే ప్రజలు, అదే విధంగా కర్ణాటకలోని కొన్ని తహశీల్స్‌లో తెలుగు మాట్లాడే ప్రజలవలనే, వారు అస్సాంలోనే



ఆంధ్రప్రదేశ్ ప్రస్తుత తీవ్ర పరిస్థితి “ప్రజాతంత్ర ఉద్యమానికి ఏర్పడిన విపత్తు” అన్న వ్యాసంలో సమైక్య ఆంధ్ర రాష్ట్రానికి అభివృద్ధి నిరోధక శక్తుల వలన, వేర్పాటువాద శక్తుల వలన విపత్తు ఏర్పడిందని శ్రీ చండ్ర రాజేశ్వరరావుగారు చేసిన మేలుకొలుపు. (21–1–1973, విశాలాంధ్ర)

వుండేందుకు అంగీకరిస్తే, అందుకు బాధపడనవసరంలేదు. కాని కచార్ ప్రాంత ప్రజలు విభజన కోరితే, అందుకు అభ్యంతరం చెప్పనవసరంలేదు.

ఆదివాసి ప్రజలు, వారు నివసించే ప్రాంతాల సమస్యకు, భాషాప్రయుక్త రాష్ట్రాల సమస్యకు మధ్య మౌలికమైన భేదం వుంది. అయితే ఆ సమస్యని యిదే వ్యాసంలో స్థూలంగా వివరించడం సాధ్యంకాదు. ఈ సమస్యను ప్రత్యేక వ్యాసంలో వేరేగా వివరించవలసిన అవశ్యకత వుంది.

## ఒకే భాషకు రెండు మూడు రాష్ట్రాలా?

ఆంధ్రప్రదేశ్ విభజనను బలపరుస్తూ మరో వాదన కూడా లేవనెత్తబడుతూంది. "హిందీ మాట్లాడే ప్రజలకు కొన్ని రాష్ట్రాలు వుండగా, తెలుగు మాట్లాడే ప్రజలకు రెండు, మూడు రాష్ట్రాలు ఎందుకు వుండరా"దని ప్రశ్నిస్తున్నారు. సిద్ధాంత ప్రాతిపదికపై ఆ విధంగా రాష్ట్రాన్ని విభజిస్తే, ఎవరూ అభ్యంతరం తెలుపరు. ఆ విధంగా రాష్ట్రాన్ని విభజించడం అవసరమా? తెలుగు ప్రజలకు, మన దేశ ప్రయోజనాలకు ఆ విధంగా విభజించడం లాభకరమా అనేది ప్రశ్న.

కాంగ్రెస్ ప్రభుత్వ విధానాలు రాష్ట్రంలో ప్రాంతీయ అసమానతలను పెంపొందించి ఆర్థిక స్తంభనను సృష్టించాయి. పర్యవసానంగానే విస్తృతస్థాయిలో నిస్పృహ ఏర్పడింది. ప్రాంతీయ అసమానతలు ప్రాంతీయ విభేదాలను సృష్టించిపెట్టాయి. కాంగ్రెస్ అధికారంకోసం ఏర్పడిన ముఠాలు, తదితర అభివృద్ధి నిరోధక శక్తులు ప్రాంతీయ ఉన్మాదాన్ని రెచ్చగొట్టాయి. ప్రత్యేకవాదుల డిమాండ్‌కు యిదే మూలకారణం.

సమన్వయపూర్వక అభివృద్ధిలోనే తెలుగు ప్రజల ప్రయోజనాలు యీడేరతాయి. రాష్ట్రం అంతా ఒకే ప్రభుత్వం క్రింద వున్నప్పుడే అది సాధ్యం.

## విభజనవల్ల అనేక కొత్త సమస్యలు:

ఆంధ్రప్రదేశ్‌ను ముక్కలుగా విభజించడం వల్ల ప్రస్తుత సమస్యలు పరిష్కారం కాకపోగా, అనేక చిక్కు సమస్యలు ఏర్పడతాయని, తద్వారా జాత్యహంకార, అభివృద్ధి నిరోధక శక్తులు వివిధ ప్రాంతాల మధ్య శత్రుత్వాన్ని రెచ్చగొట్టేందుకు మరింత అవకాశం కలుగుతుందని మా దృఢమైన అభిప్రాయం. పర్యవసానంగా, ఐక్య రాష్ట్రంలో మాత్రమే

సాధ్యమయ్యే సమన్వయపూర్వక, సమగ్రాభివృద్ధి పూర్తిగా నాశనమైపోతుంది. అందుచేత, తెలుగు ప్రజల ఐక్య రాష్ట్రాన్ని పరిరక్షించేందుకై మేం నిర్ద్వంద్వంగా పోరాడుతున్నాం.

## దేశమంతా వేర్పాటు ఉద్యమాలు తలెత్తే ప్రమాదం:

ఈ విచ్ఛిన్న వాదనసే యితర భాషాప్రయుక్త రాష్ట్రాలకు కూడా వర్తింప చేసినట్లయితే వచ్చే దశాబ్దం వరకు మన దేశం యావత్తూ యీ వేర్పాటు వివాదాలకు సంబంధించిన వూబిలోనే కూరుకుపోతుంది. ప్రస్తుతం వున్న రాష్ట్రాలు విచ్ఛిన్నం అయిపోతాయి. హిందీ భాష మాట్లాడే రాష్ట్రాలు కూడా యీ వివాదాలకు లోనుగాకుండా వుండలేవు. అవి యింకా ముక్కచెక్కలైపోతాయి. ఈ అభివృద్ధి నిరోధక క్రమంలో వర్తమాన సమస్యలు – పేదరికం, నిరుద్యోగం, పెరిగిపోతున్న ధరల నుండి ప్రజల దృష్టిని మళ్ళిస్తారు. పర్యవసానంగా దేశ ఆర్థికాభివృద్ధి కార్యక్రమానికి స్వస్తి చెబుతారు. మన దేశాన్ని వెనుకబడిన దేశంగానే వుంచాలని కోరుకుంటున్న అమెరికా సామ్రాజ్య వాదులకు, తమ దొంగడబ్బును రక్షించుకోవాలని కోరుకొనే, భారత ప్రజల రక్తాన్నిత్రాగే బడా పెట్టుబడిదారులకు, మన దేశ అభివృద్ధిని అరికట్టాలని, గత మూడు సంవత్సరాలుగా సాధించిన అభివృద్ధిని తిప్పికొట్టాలని వాంఛించే అభివృద్ధి నిరోధక శక్తులకు యిది సంతోషం కలగజేస్తుంది.

## శ్రీ బి.వి. సుబ్బారెడ్డి బెదిరింపులు:

"గతంలో ఎన్నడూ జరగని విప్లవం" అంటూను, "ప్రత్యేక ఆంధ్రను ఏర్పాటు చెయ్యకపోతే దేశం ఉత్తర–దక్షిణ ప్రాంతంగా రెండు భాగాలుగా విడిపోతుందని, ఆ విధంగా దక్షిణ భారతంపై ఉత్తర ప్రాంతంవారి పెత్తనాన్ని తొలగించుకుంటామ"ని ప్రత్యేకాంధ్ర ఉద్యమ అగ్రనాయకుడు శ్రీ బి. వి. సుబ్బారెడ్డి తరుచుగా చేస్తున్న బెదిరింపులను మనం జ్ఞాపకం చేసుకోవాలి.

(ఆంధ్ర ప్రాంత లాయర్ల సమావేశానికి ముందు, జనవరి 24వ తేదీన కాకినాడలో బి. వి. సుబ్బారెడ్డి యిచ్చిన ప్రసంగం జనవరి 25వ తేదీ ఇండియన్ ఎక్స్‌ప్రెస్ విజయవాడ ఎడిషన్ నుండి) ఈ దురహంకారపూరిత బెదిరింపులు డి.ఎం.కె. నాయకుల ప్రసంగాలకు

ఎంతో సన్నిహితంగా వున్నాయి. ఇటీవల తీవ్రమైన సంక్షోభంలో పడిన తర్వాత, యిప్పుడు డి.ఎం.కె. నాయకత్వం తమ వేర్పాటు డిమాండును అస్పష్టంగా తెలియజేసింది.

## డి.ఎం.కె. అడుగుజాడలు:

జనవరి మొదటివారంలో పుదుక్కోటలో జరిగిన డి.ఎం.కె. జనరల్ కౌన్సిల్ సమావేశం చేసిన తీర్మానంలో "తమిళనాడుకు పూర్తి స్వపరి పాలన హక్కు యివ్వాలని, కేంద్రంలో సంయుక్త ప్రభుత్వం వుండాల"ని తెలియజేసింది.

"కేంద్రంలో సంయుక్త ప్రభుత్వం" అంటే, కేంద్రంలోని రాజకీయ పార్టీల మిశ్రమ ప్రభుత్వం కాదనీ, రాష్ట్రాల ప్రతినిధుల ప్రభుత్వమని శ్రీ కరుణానిధి ఆ తీర్మానాన్ని వివరించారు.

ప్రమాదకరమైన ఈ ఉద్దేశం యొక్క వివరాలను తెలుసుకోవడానికి, ఇందుకోసమై డి.ఎం.కె. ప్రభుత్వం నియమించిన రాజమన్నారు కమిటీ తయారుచేసిన నివేదికను చదవవలసిన అవసరం వుంది. దీనికి స్పష్టమైన అర్థం ఏమిటంటే, యితర దేశాలతో ప్రత్యేక సంబంధాలు పెట్టుకోడానికి హక్కులతో సహా రాష్ట్రాల ఫెడరేషన్ కాకుండా, కాన్ఫెడరేషన్ ఏర్పాటు చెయ్యాలని. మహత్తరమైన మన దేశాన్ని ముక్కచెక్కలు చెయ్యడానికి సామ్రాజ్యవాదులు యింతకంటే ఎక్కువ ఏం కోరుకుంటారు?

## ఆంధ్రలో వేర్పాటువాదులెవరు?

అయితే, మన దేశ ఐక్యతకు ప్రమాదం ప్రస్తుతం ఏమీ లేదు కాని, యీ ప్రసంగాలను తేలికగా త్రోసిపుచ్చటం అంటే, అది మన దేశానికి ప్రమాదకరమే. ఇంకా యితర ప్రాంతీయ దురహంకార శక్తులు అదనుకోసం వేచివున్నాయి. సకాలంలో ఆ శక్తులను దెబ్బతీయకపోతే, మన దేశ ఐక్యతను కాపాడుకోగల పరిస్థితి వుండదు.

"ప్రజలు వేరుపడిపోతామని కోరినప్పుడు ఎందుకు విభజన చేయరు?" అని ఆంధ్రప్రదేశ్‌లోని వేర్పాటు ఆందోళన సందర్భంగా మరొక ప్రశ్న అడుగుతున్నారు. మధ్యతరగతులకు చెందిన అత్యధిక సంఖ్యాకులు, విద్యార్థులు, యన్.జి.ఓ.లు, తదితరులు, ప్రత్యేకించి ఆంధ్రప్రాంతంలోని నాలుగు సంపన్న జిల్లాలలోని ఒక వర్గం రైతులు, తాము ఊహించుకున్న భయాందోళనలతో ఆందోళనలో కలిశారు.



ప్రత్యేక తెలంగాణా ఉద్యమం సమసిపోయిందనుకుంటె 1973 ప్రారంభంలో ప్రత్యేక ఆంధ్ర ఉద్యమం తలెత్తి రాష్ట్రాన్ని రెండు ముక్కలు చేయాలని తలపడింది. ఆంధ్రప్రదేశ్ ని విభజించినట్లైతే దేశమంతా విచ్ఛిన్నం కాగలదని ముందుగానే శ్రీ చంద్ర చేసిన హెచ్చరిక.

(31-1-1973, విశాలాంధ్ర)

## వేర్పాటుకు శ్రామికవర్గాలు అనుకూలం కాదు:

అయితే, యీ ప్రాంత జనాభాలోని అత్యధిక సంఖ్యాకులైన 50 శాతంమంది ప్రజలు వ్యవసాయ కార్మికులు, కార్మికులు, రైతాంగంలోని అత్యధిక సంఖ్యాకులు, జనాభాలోని యితర పేద వర్గాల విషయం ఏమిటి? భూస్వాములు, రైస్ మిల్లర్లు, గుత్త వ్యాపారస్తులు, ప్రైవేటు బస్సు యజమానులు, ప్రజల రక్తాన్ని పీల్చే తదితరులు యీ వేర్పాటు ఉద్యమానికి నాయకత్వం వహించి, ప్రభుత్వం కొద్ది ప్రమాణంలో చేసిన అభివృద్ధికర చర్యలను విచ్ఛిన్నం చేయడానికి కొనసాగిస్తున్న చర్యలను వారు గమనిస్తూనే వున్నారు. తమకు అవకాశం లభించినప్పుడల్లా వారు తమ వాంఛలను వ్యక్తం చేస్తూనే వున్నారు. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ఏర్పాటు చేయబడిన ప్రదర్శనలు, ఊరేగింపులలో వారు వందల, వేల సంఖ్యలో పాల్గొంటూనే వున్నారు. వారు పూర్తిగా తమ సంఖ్యకు అనుగుణంగా బయటకు రాలేకపోవడానికి కారణం, అభివృద్ధి నిరోధక పార్టీలు జిల్లా పరిపాలనాధికారులు పూర్తి మద్దతులతో సమష్టిగా జరిపిన ఎదురుదాడివల్ల గుక్కతిప్పుకోలేకుండాపోతున్నారు.

## మెజారిటీ శాసనసభ్యులు సమైక్యత కొరకే:

ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యుల విషయం తీసుకొనేటట్లయితే, నిర్ణాయక మైన మెజారిటీ సమైక్య రాష్ట్రాన్నే బలపరుస్తున్నారు. బలపరచవలసిందిగా దౌర్జన్యాలకు వేర్పాటువాదానికి గురిచేయబడిన అనేకమంది శాసనసభ్యులు మామూలు పరిస్థితులు ఏర్పడితే, సమైక్య రాష్ట్రానికి అనుకూలంగా తాము మాట్లాడగలమని కాంగ్రెస్ హైకమాండ్‌కు తెలియజేశారు.

ప్రజల భవిష్యత్తును నిర్ణయించేందుకు అటువంటి దురహంకార, విచ్ఛిన్నకర ఆందోళనలు జరపడమే ముఖ్యమైనట్లయితే, దేశంలో అనేక ప్రాంతాల్లో వాటిని తిప్పికొట్టేందుకు తగినంత అవకాశం వుంది. ప్రజల హీనపరిస్థితిని అవకాశంగా తీసుకొని వారి అసంతృప్తిని ప్రక్కదోవలు పట్టించడానికి ఏదో ఒక చిన్న అంశాన్ని కూడా కొండంతలు చేయవచ్చును. తద్వారా వారి అసంతృప్తిని జాత్యహంకార, విచ్ఛిన్న మార్గాలను పట్టించ వచ్చును. అభివృద్ధి నిరోధక. స్వార్ధపరశక్తులు, అభివృద్ధి నిరోధక పార్టీలు, ఉన్నతశ్రేణి నిరంకుశోద్యోగులు, నిరాశావాదులైన కాంగ్రెస్ నాయకులు కలిసి దేశంలో ఏ ప్రాంతంలోనైనా ఇటువంటి తీవ్ర పరిస్థితిని సృష్టించవచ్చును.

వీరిని విప్లవ మార్గంలోకి తీసుకుపోతున్నామనే సాకుతో మావోయిస్టు ఉగ్రవాదులు తాము వున్నచోటల్లా, తమ సహాయం అందచేయవచ్చును కూడా. ఆంధ్రప్రదేశ్‌లో సరిగా యిదే జరిగింది. కొన్ని వందల రాష్ట్ర ప్రభుత్వోద్యోగాలకు సంబంధించిన వివాదాన్ని యీ స్థాయికి తీసుకువచ్చి యించుమించు విచ్ఛిన్నానికి సంసిద్ధమైపోయారు.

## సవాలును ఎదుర్కోవాలి:

అభివృద్ధి నిరోధక శక్తులు, జాతీయ దురహంకార శక్తులు, అవకాశవాదులు కలిసికట్టుగా జరుపుచున్న ఎదురుదాడి సవాలును రాజకీయంగాను, ఆచరణరీత్యాను కూడా ఎదుర్కోవలసిన అవసరం వుంది. సాధ్యం కాదనే సాకుతో, సాచివేతతో ఈ ప్రతిపశక్తులకు లొంగిపోరాదు.

జాతీయ స్థాయిలో, అదుపుతప్పిన స్థితికి వచ్చిన తరువాత విచారించి లాభంలేదు.

జనసంఘ్, తదితరులు లేవదీసే మౌలిక ప్రశ్నను యిప్పుడు పరిశీలించుదాము. జనసంఘ్ ఇపుడు ఆంధ్రప్రదేశ్ విభజనను గట్టిగా కోరుతోంది. అందుకు తలక్రిందులుగా ప్రయత్నిస్తోంది. రాష్ట్రాల పునర్విభజన ద్వితీయ కమిషన్‌ను నియమించాలని కోరుతుంది. జనసంఘ్ ఎల్లప్పుడు భాషా రాష్ట్రాలను వ్యతిరేకించుతూనే వచ్చింది. ఇటీవల పంజాబ్, హర్యానాలను ప్రత్యేక రాష్ట్రాలుగా ఏర్పరచినప్పుడు దానిని వ్యతిరేకించింది. భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన దేశ ఐక్యతను బలహీనపరుస్తుందని జనసంఘ్ దృఢాభిప్రాయం. మన దేశానికి యూనిటరీ స్టేట్స్ (కేంద్రీకృత రాజ్యాంగం) వుండాలని జనసంఘ్ అధికార విధానం ప్రకటించుతుంది. దేశాన్ని భాషాప్రయుక్తంగా కాక పరిపాలనా ఆర్థిక వివరాల దృష్ట్యా నాల్గయిదు ప్రాంతాలుగా విడదీయాలట.

## జనసంఘ్ విచ్ఛిన్నకర విధానాలు:

కాని యిప్పుడు జనసంఘ్ చెబుతున్నదేమిటి? ప్రాంతీయతత్వాలు, ద్వేషాలు పెరిగిపోయిన నేటి వాతావరణాన్ని తన కనుకూలంగా వినియోగించుకోడానికిగాను ఒకే భాషా ప్రాంతంలోని వారిని ఒకరిపై ఒకరిని ఉసికొల్పుతూ, ఆయా భాషా రాష్ట్రాలను విచ్ఛిన్నం చేయడానికే తయారైంది. మరి తాను మొదటినుండి చెబుతూ వచ్చిన సిద్ధాంతానికి యిప్పుడు చెబుతున్నదానికి ఏ విధంగా లంకె కుదుర్చుతుందో తెలియదు.

## దౌర్జన్యచర్యలు, దహనకాండ, బెదిరింపులు, భయోత్పాతం

జై ఆంధ్ర ఉద్యమకారులు ఆ రోజుల్లో జరిపిన బీభత్స, భయానక చర్యలను విశాలాంధ్ర దినపత్రిక అద్దంలో చూపించినట్లు ప్రచురించింది. ఈ దౌర్జన్యకాండలను, దహన కాండలను తిప్పికొట్టడానికి కమ్యూనిస్టు పార్టీ, చండప్రచండునిలా నిలబడిన శ్రీ చంద్ర నాయకత్వాన పోరాడింది.

(3–2–1973, విశాలాంధ్ర)

చిన్న రాష్ట్రాల అధికారాలు తగ్గించి వాటిని నిర్వీర్యంచేసి, ప్రస్తుతం వున్న జోనల్ కౌన్సిళ్ళను నిజమైన రాజకీయాధికారం చెలాయించే విధంగా ఏర్పరచడానికి జనసంఘ్ ప్రయత్నించవచ్చు.

కేంద్ర ప్రభుత్వంలో ఒకప్పుడు ఉన్నతాధికార పదవిలో వున్న శ్రీ హెచ్.వి.ఆర్. అయ్యంగార్ జనవరి 26వ తేదీన హిందూ పత్రికలో, ప్రత్యేక ఆంధ్ర ఉద్యమంపై వ్రాసిన వ్యాసంలో సరిగ్గా జనసంఘ్‌లాగే తెలియజేశారు.

## మాజీ ఐ.పి.ఎస్. పగటికలలు:

భారతదేశంలోని రాష్ట్రాల మధ్య సరిహద్దులకు, భాషా ప్రాతిపదికపై కాకుండా మరింత హేతుబద్ధమైన ప్రాతిపదికపై పునర్నిర్ణయించేందుకు యిది సమయం అవునా కాదా..... గతంలో జరిగిన తప్పులను సరిదిద్దుకుని, చరిత్ర గమనాన్ని సరైన విధంగా తిప్పడంలోనే వుంది అని ఆయన అన్నారు.

సర్వే సర్వత్రా గౌరవ ప్రతిష్ఠలు పొందిన గత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ భాషా ప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటుచేసే విషయంలో ఊగిసలాటకు లోనైందుకుగాను ఆయనకు "హేమ్లెట్" అనీ, "పరస్పర విరుద్ధభావాల మధ్య దిక్కుతోచనివాడు" అని, యీాయన నిందించాడు. ఈ ఐ.పి.యస్. నిరంకుశోద్యోగి, యావజ్జీవిత కాలమూ బ్రిటిష్ సామ్రాజ్యవాదుల గులాంగా వంగి వంగి సలాములు చేస్తూ పనిచేసిన బాపతు ఈ పెద్దమనిషి గతాన్ని ఒకసారి గుర్తుచేసుకుని, ఆనాడు దేశంలో వివిధ భాషలు మాట్లాడే ప్రజలను కృత్రిమంగా కొన్ని రాష్ట్రాలలో కట్టివేసివుంచి వారి ఆర్థిక, రాజకీయ, సాంస్కృతికాభివృద్ధులను నిరోధించిన విషయం జ్ఞాపకం తెచ్చుకోవడం మంచిది. ఆ రోజులు ఎన్నటికీ తిరిగిరావు. ఈ కరుడుగట్టిన ఐ.పి.యస్. ఉద్యోగి కలలుగన్న విధంగా కడకు దేవుడు దిగివచ్చినా నేటి చరిత్ర గమనాన్ని అడ్డుకొట్టలేడు.

ఒకవేళ దురదృష్టవశాత్తు ప్రస్తుత రాష్ట్రాల విభజనే మళ్ళీ జరిగితే, అవి చిన్న భాషా రాష్ట్రాలుగానే వుంటాయే తప్ప ఉమ్మడి రాష్ట్రాలుగా తిరిగి ఎన్నటికీ కాజాలవు.

## జాతీయ పోరాటంలో భాగం - భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన:

మొదట కొంత తటపటాయింపులకు లోనైనప్పటికీ 1953లో ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తరువాత శ్రీ నెహ్రూ ఒక నిజమైన ప్రజాతంత్రవాదిగా రాష్ట్రాల పునర్విభజన కమిషన్‌ని నియమించడంలో తన ఔన్నత్యాన్ని ప్రదర్శించి 1956లో భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడేట్లు తోడ్పడ్డారు.

భాషా రాష్ట్రాలకు సంబంధించిన మరో విషయాన్ని ఇక్కడ ప్రస్తావించవలసి వుంది. భాషా రాష్ట్రాల కోర్కెలో యిమిడివున్న ప్రధానాంశాలు అత్యున్నత స్థాయిలో మాతృభాషలోనే విద్యాబోధన, ప్రాంతీయ భాషల్లోనే పరిపాలనా వ్యవహారాలు సాగించాలన్నవే. దీనితోపాటు మనదేశ ప్రజలలో సగభాగం మాట్లాడే హిందీని ఇంగ్లీషు స్థానంలో క్రమంగా మన దేశ సంధాన భాషగా ప్రవేశపెట్టాలని కూడా ఆశించడం జరిగింది. ప్రపంచంలోని ఒక ప్రధాన భాషగా ఇంగ్లీషు మన దేశంలో కొనసాగవచ్చు.

కాని 25 సంవత్సరాల స్వాతంత్ర్యం అనంతరం కూడా ఈ ముఖ్య అంశాలు యింకా అమలుజరగలేదు. దీనికి కారణం కాంగ్రెసులో వున్నవారితో సహా అభివృద్ధి నిరోధక, జాతీయ దురహంకార శక్తులే. వీరు ప్రజల అనుమానాలను రెచ్చగొట్టిన ఫలితంగా ప్రాంతీయ భాషలను యూనివర్శిటీల్లో బోధనా భాషలుగా ప్రవేశపెట్టడానికి వ్యతిరేకంగాను, హిందీకి వ్యతిరేకంగాను సమ్మెలు, సంఘర్షణలు, కొట్లాటలు జరిగాయి.

భాషా ప్రయుక్త రాష్ట్రాలకు ఎవరైతే వ్యతిరేకంగా ఉన్నారో ఆ శక్తులే యూనివర్శిటీలలో పరిపాలనలో ఇంగ్లీషు బోధనా భాషగా శాశ్వతంగా వుంచాలని గట్టిగా వాదించుతున్న శక్తులు. ఈ విషయంలో జనసంఘం అభిప్రాయం భిన్నంగా వుంది. ప్రాంతీయ భాషలు మట్టికొట్టుకుపోయినా సరే- కేంద్రంలోను, రాష్ట్రాలలో కూడా ఇంగ్లీషు స్థానంలో హిందీని పరిపాలనా భాషగా వెంటనే ప్రవేశపెట్టాలనీ, యూనివర్శిటీలో బోధనా భాషగా కూడా హిందీని ప్రవేశపెట్టాలని జనసంఘ్ వాదించుతోంది.

## కర్తవ్యం:

తాత్కాలిక అడ్డంకులు వచ్చినప్పటికీ ప్రాంతీయ భాషలకు రాష్ట్రాలలో వాటి సముచిత స్థానం అనగా పరిపాలనా భాషలుగా, బోధనా భాషలుగా అవి పొంది తీరాలి. దేశ సంధాన భాషగా హిందీ వుండాలి. మన

దేశ ప్రజాతంత్ర పురోగమనానికి మన మహా దేశ ప్రజాసంస్కృతి మహోజ్జ్వలంగా వికసించడానికి యిది ఎంతో అవసరం.

నేడు ఆంధ్రప్రదేశ్‌లో బయలుదేరిన వేర్పాటు ఉద్యమం ఒక్క ఆంధ్రప్రదేశ్ సరిహద్దులకే పరిమితమైన విషయం కాదు. ఆంధ్రప్రదేశ్ గనుక చీల్చబడినట్లయితే యిది ఒక గొలుసుకట్టు పరిణామంగా తయారై, ఇతర రాష్ట్రాలలో కూడా ఇదేరకం వేర్పాటు ఉద్యమాలు వ్యాపించుతాయి. అందుచేత దేశంలో వున్న ప్రజాతంత్ర శక్తులన్నీ ఎట్టి ఆలస్యం లేకుండా ముందుగానే మేల్కొనడం అవసరం.

*(31–1–1973, విశాలాంధ్ర)*

* * *

# 'ప్రత్యేకాంధ్ర' నినాదంతో మొదలై 'ప్రత్యేక దక్షిణ భారత' నినాదానికి పయనం

"ప్రత్యేకాంధ్ర" నినాదంతో మొదలై "ప్రత్యేక దక్షిణ భారత" నినాదానికి వేర్పాటువాద శక్తులు ఎలా పయనిస్తున్నాయో బహిర్గతం చేస్తూ చంద్ర రాజేశ్వరరావుగారు 20-1-1973వ తేదీన వ్రాసిన వ్యాసం దిగువ యిస్తున్నాం.

అభివృద్ధి నిరోధకుల, స్వార్థపర శక్తుల నాయకత్వం క్రింద నిర్వ హింపబడుతున్న ప్రత్యేక ఆంధ్రోద్యమంలో ఎన్.జి.ఓ.లు, విద్యార్థులు పాల్గొంటున్న విషయంలో సందేహం లేదు. కాని వారు అనుసరిస్తున్న పద్ధతులనుబట్టి మాత్రమే కాకుండా, ఆ ఉద్యమంలోని మరికొన్ని యితర అంశాలనుబట్టి కూడా ఆ ఉద్యమంలోని జాత్యహంకార, ప్రజాస్వామ్య వ్యతిరేక స్వభావాన్ని చూడవచ్చు.

## శ్రీ తిమ్మారెడ్డి ధోరణి:

హరిజనులను, జర్నలిస్టులను కొట్టవలసిందేనంటూనూ, యింకా యితర అభివృద్ధి నిరోధక ప్రకటనలు చేయడం ద్వారా యావద్భారత దేశంలో అప్రతిష్టపాలైన ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి పత్రికలవారితో మాట్లాడుతూ ఆంధ్రప్రాంతంలోని పరిస్థితిని, విముక్తిచెందడానికి ముందు బంగ్లాదేశ్‌లోని పరిస్థితితో పోల్చారు. కాని, తర్వాత భారత ప్రభుత్వాన్ని పాకిస్తాన్‌లోని యాహ్యాఖాన్ సైనిక ప్రభుత్వంతో సరిపోల్చడానికి వెనుకాడారు. కాని వియత్నాంలోని అమెరికా సామ్రాజ్యవాదులతో సరిపోల్చారు.

ఆంధ్రప్రదేశ్ మాజీ డిప్యూటీ ముఖ్యమంత్రి, వేర్పాటు కాంగ్రెస్‌వాదుల కమిటీ అధ్యక్షుడు, ప్రస్తుతం వేర్పాటు ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న శ్రీ బి. వి. సుబ్బారెడ్డి ఆ వాదనను మరింత ముందుకు తీసుకుపోయారు. కేంద్ర ప్రభుత్వం ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని యివ్వకపోతే దక్షిణ భారతదేశం ఉత్తర భారతదేశాన్నుండి విడిపోతుందని బెదిరించారు.

## శ్రీ బి. వి. సుబ్బారెడ్డి బెదిరింపు:

"జనవరి 21వ తేదీ లోపల ప్రత్యేకాంధ్రపై ప్రకటన చెయ్యకపోతే ఆ ప్రాంతంలోని కాంగ్రెస్‌వాదులు పార్టీకి రాజీనామా చేస్తారు. కాంగ్రెస్ ఆంధ్రను పోగొట్టుకున్నట్లయితే ఉత్తర భారతం నుండి దక్షిణ భారతం విడిపోవడానికి దారితీస్తుందని శ్రీ సుబ్బారెడ్డి బెదిరించారు." (ఇండియన్ ఎక్స్‌ప్రెస్, 1973 జనవరి 11, విజయవాడ సంచిక) మచిలీపట్నంలో జనవరి 10వ తేదీన జరిగిన బహిరంగసభలో సుబ్బారెడ్డి పై విధంగా బెదిరించినట్లు ఆ పత్రిక తెలిపింది.

ఆ వాదనలోని అంతరార్థం ఏమిటో స్పష్టమే. ప్రత్యేకాంధ్ర నినాదాన్ని కాంగ్రెస్ మంత్రులుగా ఉండగానే ప్రచారం చేశారు. ఇప్పుడు, వీరు తమరాజీనామాలు ఆమోదించబడిన తర్వాత, కాంగ్రెస్ నాయకులుగా ప్రత్యేక దక్షిణ భారత నినాదాన్ని ప్రచారం చేస్తున్నారు. ఇదే విచిత్రం.

## మహావిప్లవం ఏమిటి?

తాను ప్రకటించిన తేదీ నాటికి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటుచేయకపోతే, బ్రహ్మాండమైన విప్లవం జరుగుతుందని సుబ్బారెడ్డి ప్రకటించారు. ఆ విప్లవం యొక్క స్వభావం ఏమిటి? సమైక్యతావాదులపై దాడి జరపడం, ప్రభుత్వ అస్తులను, అటువంటివే యితర అస్తులను నాశనం చెయ్యడం.

గుంటూరు జనవరి 12వ తేదీన శ్రీ బి.వి. సుబ్బారెడ్డి అధ్యక్షత వహించిన బహిరంగసభలో శ్రీ. బి. పాపిరెడ్డి, ఎం.పి. (యీ విధమైన కార్యక్రమాన్నే ప్రతిచోట తెలియజేస్తూ వచ్చారు.) "ఈ ఉద్యమంలో ప్రతి ఒక్కరూ తనకు యిష్టమైన ఏదో పని చెయ్యా"లని ప్రజలకు పిలుపిచ్చారు. "గుంటూరు రైల్వే స్టేషన్‌ను తగులబెట్టడం, అది పెద్దదైన దృష్ట్యా (అయన దృష్టిలో ఎక్కువ రక్షణ ఏర్పాట్లు చేయబడతాయనే), సాధ్యంకాకపోతే, సమీపంలో వున్న చిన్నరైల్వేస్టేషన్‌ను తగులబెట్టండి" అని చెప్పారు.

ప్రత్యేక తెలంగాణా ఏర్పాటు ఏ ఒక్క సమస్యను పరిష్కరించలేదని – తెలంగాణా బంద్‌లో పాల్గొనవద్దని కమ్యూనిస్టు నాయకులు చేసిన హెచ్చరిక.

(2–3–1969, విశాలాంధ్ర)

## "సోదరుల్లా విడిపోదాం" అనే నినాదం ఒకవైపు!

వేర్పాటువాదులు యిటీవల మరొక వింత వాదన మొదలెట్టారు. సోదరులలాగా రాష్ట్రాన్ని విభజించుకుందాం." ప్రత్యేకాంధ్రవాదుల నుండి యీ మాటలు రావడం విచిత్రంగా వుంది. ఎందుచేతనంటే, తెలంగాణా ప్రజలపట్ల తీవ్రద్వేషాన్ని రెచ్చగొట్టి ఈ ఉద్యమాన్ని నిర్మించారు. రాష్ట్ర విభజనవల్ల జరిగే తీవ్రమైన హానిని గురించి వారికి పట్టలేదు. "తమను రెండవ తరగతి పౌరులుగా చూస్తున్నారని, ఆంధ్రప్రజలు హైదరాబాద్ నగరంలో గౌరవప్రదంగా జీవించలేరని, ఆంధ్ర ప్రాంత మహిళలను అగౌరవపరచారనీ, తెలంగాణా ప్రాంతంలో ఆంధ్రులను కొట్టారనీ" వార్తాపత్రికల ద్వారా తప్పుడు వార్తలను ప్రచారంలో పెట్టారు.

హైదరాబాద్ నగరానికి, తెలంగాణా ప్రాంతానికి ఆంధ్ర ప్రాంతంనుండి పాలు, బియ్యం చేరకుండా అభ్యంతరపరచారు. పాల వాన్‌లపై దాడిచేసి, వేలాది లీటర్ల పాలు నేలపాలు చేశారు.

## సోదరులకు బియ్యం, పాలు పంపవద్దని మరోవైపు!

హైదరాబాద్ తీసుకుపోయి, అక్కడినుండి యితర రాష్ట్రాలకు పంపే బియ్యాన్ని రైల్వే వ్యాగన్లలో లోడ్ చెయ్యడానికి అనుమతించలేదు. హైదరాబాద్ వెడుతున్న బియ్యపు లారీలను మార్గమధ్యంలో ఆపుచేశారు.

తెలంగాణా ప్రాంతానికి మినహా, ఎక్కడికైనా బియ్యం ఎగుమతులను అనుమతిస్తామని ఇటీవల రైస్ మిల్లర్ల అసోసియేషన్ ప్రకటించింది.

సోదరులుగా విడిపోయే పద్ధతి యిదేనా? రాష్ట్రం విడిపోయే పరిస్థితే ఏర్పడితే, కేవలం కొన్ని వందల ప్రభుత్వ ఉద్యోగాల కోసం నినాదాన్ని రెచ్చగొట్టిన వీరు అప్పులు, ఆస్తుల పంపిణీ, నదీజలాల వంటి వాటి విషయంలో ఘర్షణ పడరనే హామీ ఏమైనా వుందా? ఆంధ్ర ప్రాంతంలో సంభవించే ప్రతి దురదృష్ట ఘటనకు తెలంగాణా ప్రజలు, కేంద్ర ప్రభుత్వమే బాధ్యులని నిందిస్తూ, ఉభయ ప్రాంతాల మధ్య శాశ్వతమైన శత్రుత్వాన్ని రెచ్చగొడతారా?

ప్రతి జాత్యహంకార ఉద్యమం సంకుచిత భావాలతో కూడిన యీ పద్ధతులలోనే నడుస్తుంది. మనకు చరిత్ర నేర్పే సత్యం కూడా యిదే.

*(20-1-1973, విశాలాంధ్ర)*

# వేర్పాటు ఆందోళన: అభివృద్ధి నిరోధక పార్టీల పాత్ర

మహాత్తర సంఘటన పార్టీలు జనసంఘ్, స్వతంత్ర, సిండికేట్, ఆంధ్రప్రదేశ్ విభజననే బహిరంగంగా బలపరుస్తున్నాయి. ప్రప్రథమంగా మహాత్తర కూటమి రాష్ట్ర శాఖలే ప్రత్యేకాంధ్ర ఏర్పాటుచెయ్యవలసిందిగా డిమాండ్ చేశాయి. అభివృద్ధి నిరోధక స్వార్థపరశక్తుల ప్రత్యక్ష సహాయంతో తమ సంకుచిత లక్ష్యసాధనకు దుష్ప్రచారం, భయపెట్టడం, భీతావహం కలిగించడం, దహనకాండ వంటి ఎత్తుగడలను అవలంబిస్తున్నారు. మహాత్తర కూటమి మిత్రపార్టీ అయిన సోషలిస్టు పార్టీ కూడా తన మామూలు ధోరణిలోనే పై పార్టీల చర్యలకు తోడ్పడుతూ వచ్చింది. ప్రాంతీయ జాత్యహంకార పార్టీ అయిన అకాలీపార్టీ, డి.యం.కె. పార్టీ ఆంధ్రలో ఏర్పడిన గందరగోళ పరిస్థితులపట్ల సంతోషం వ్యక్తం చేస్తున్నాయి. అంతేకాక, ఆంధ్ర విభజనను ఆ పార్టీలు కూడా బలపరుస్తున్నాయి. పాత మహాత్తర కూటమి, ప్రాంతీయ జాత్యహంకార పార్టీలతో కలిసి తన పాత కార్యక్రమాన్నే కొనసాగిస్తున్న విషయం యిప్పుడు స్పష్టంగానే బయటపడింది.

## రాష్ట్ర విచ్ఛిత్తికి వాజ్‌పాయ్ తోడ్పాటు:

ఆంధ్రలో ఏర్పడిన గందరగోళ పరిస్థితిని తమకు అనుకూలంగా వినియోగించుకోడానికై అభివృద్ధి నిరోధక పార్టీల నాయకులు అన్ని ప్రయత్నాలు చేస్తున్నారు. సుమారు ఒక నెలరోజులు క్రితమే "జనసంఘ్ పరిశీలక బృందం" గందరగోళ పరిస్థితి ఏర్పడిన ప్రాంతాల్లో పర్యటించి, వేర్పాటును బలపరుస్తూ ఒక పెద్ద రిపోర్టు ప్రకటించింది. జనసంఘ్ అగ్రనాయకుడు అతల్ బిహారి వాజ్‌పాయ్ సంక్షోభానికి గురైన విజయవాడ,

గుంటూరులలో పర్యటించి, ధైర్యాన్ని కోల్పోతున్న వేర్పాటువాద శక్తులలో తిరిగి కొంత ధైర్యాన్ని కలుగజేశారు. ఇప్పుడు డి.ఎం.కె. ఎం.పి విశ్వనాథన్ ఆంధ్రలో పరిస్థితుల పరిశీలనకై పర్యటనలు ప్రారంభించారు. మహత్తర కూటమిలోని ఇతర పార్టీల నాయకులు కూడా ఆంధ్రలో త్వరలోనే పర్యటనలు జరపవచ్చును.

ఆంధ్రప్రాంతంలో ప్రస్తుతం పర్యటన చేస్తున్న విశ్వనాథన్ ప్రధానికి వ్యతిరేకంగా ఏవేవో ప్రచారం చేస్తున్నాడు. ఫిబ్రవరి 5వ తేదీన ఒంగోలులో ప్రసంగిస్తూ "ఆంధ్రప్రదేశ్‌లోని డి.యం.కె. యూనిట్ సభ్యులు కూడా వ్యక్తిగతంగా వేర్పాటు ఉద్యమంలో పాల్గొంటున్నార"ని అంగీకరించారు. (ఫిబ్రవరి 6 ఇండియన్ ఎక్స్‌ప్రెస్, విజయవాడ ఎడిషన్)

ఆంధ్ర వేర్పాటువాదుల డిమాండ్‌కు కేంద్ర ప్రభుత్వం లొంగిరాకపోతే "యావత్తు దక్షిణ భారతదేశం ఉత్తర భారతంనుండి విడిపోతుంది" అని బి. వి. సుబ్బారెడ్డి చేసిన బెదిరింపునే విశ్వనాథన్ పునరుద్ఘాటించారు.

"దక్షిణ ప్రాంతం విడిపోతే (మీ సి.ఆర్.పి.) సాయుధ దళాలు నిరుపయోగమై పోతాయి." (ఆంధ్రజ్యోతి, ఫిబ్రవరి 6)

ఈ విధంగా ఒక ఆవృత్తి పూర్తయింది. ప్రత్యేకాంధ్ర ఆందోళనతో డి.యం.కె. సంతోషంతో ఉబ్బితబ్బిబ్బయిపోయింది. ఈ అవకాశాన్ని భగవత్ప్రసాదంగా డి.ఎం.కె. భావిస్తుంది. అందుచేతనే డి.యం.కె. "కేంద్రంలో సంయుక్త ప్రభుత్వం, తమిళనాడుకు పూర్తి స్వపరిపాలన, తద్వారా భారతదేశం నుండి దక్షిణ భారతం విడిపోవాలి." అనే తన పాత నినాదాన్ని ముందుకు తెచ్చింది.

## వాజ్‌పాయ్ దాటవేత:

వాజ్‌పాయ్ తన పాత ధోరణిలోనే ఉపన్యాసాలు యిస్తూ భారత కమ్యూనిస్టు పార్టీపై తీవ్రంగా దాడిజరుపుతున్నాడు. వాజ్‌పాయ్ యీ సమస్యను చిన్న రాష్ట్రాలకు, పెద్ద రాష్ట్రాలకు మధ్య వైరుధ్యంగా పేర్కొంటూ, పాత పంజాబు విభజనను అదే విధంగా మేఘాలయ, నాగాభూమి వంటి చిన్న రాష్ట్రాల ఏర్పాటును కమ్యూనిస్టు పార్టీ బలపరిచిందనీ, అట్టి స్థితిలో ఆంధ్రప్రదేశ్‌ను ఎందుకు విభజించరాదని ప్రశ్నించారు. ఆయన తీవ్రమైన తప్పిదం చేసినవాడిలాగా, అకాలీ మతతత్వం పేరుతో, పాత పంజాబు విభజనపట్ల తమ పార్టీ అనుసరించిన

అవకాశవాద వైఖరిని కప్పిపుచ్చుకోడానికి, సరియైన వివరణ యివ్వకుండా దాటవేశాడు. భాషాప్రయుక్త రాష్ట్రాల సిద్ధాంతంపట్ల తమ పార్టీ వ్యతిరేక వైఖరి మూలంగానే కాకుండా, తమ పార్టీ హిందూ మతతత్వ వైఖరి మూలంగా కూడా పంజాబు విభజనకు వ్యతిరేకించారనేది వాస్తవం. పాత పంజాబులో, పంజాబీ భాష మాట్లాడే రాష్ట్రం ఏర్పాటుచేయబడితే, సిక్ మెజారిటీ రాష్ట్రం కూడా ఏర్పాటు చేయబడుతుందని జనసంఘ్ భయపడిపోయింది. అందుచేతనే జనసంఘ్ పాత పంజాబు రాష్ట్ర విభజనకు వ్యతిరేకత తెలిపింది.

## భాషా రాష్ట్రాలకు కమ్యూనిస్టు పార్టీ సహకారం:

అయితే భారత కమ్యూనిస్టు పార్టీకి మాత్రం అటువంటి అభివృద్ధి నిరోధక సంకుచిత అభిప్రాయాలు లేవు. భాషాప్రయుక్త రాష్ట్రాల సిద్ధాంతానికి కమ్యూనిస్టు పార్టీ కట్టుబడివుంది. అందుచేత భాషాప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటును పెద్దవీ, చిన్నవీ అనే వాటితో నిమిత్తం లేకుండా కమ్యూనిస్టు పార్టీ బలపరుస్తోంది. ఆదివాసీ ప్రజల విషయంలో, ఆయా ఆదివాసీ ప్రజల చైతన్యం, వారి ప్రయోజనాలను దృష్టిలో వుంచుకొని, వారి ప్రత్యేక హక్కులను కాపాడటం, లేదా ప్రస్తుత రాష్ట్రాలలోనే స్వయం పరిపాలనా హక్కులను కాపాడటం, లేదా భారతదేశంలో భాగంగా ప్రత్యేక రాష్ట్రాన్ని బలపరచడం మా పార్టీ విధానం. ఆ సూత్రం ప్రాతిపదికపైనే నాగాలాండు, మేఘాలయ, మిజోరం ఏర్పాటును మా పార్టీ బలపరిచింది. ఈ రాష్ట్రాలలో అనేక తెగలు, ఆదివాసీ ప్రజలు నివాసం ఏర్పరచుకొని వున్నారు. అయితే భాషా ప్రయుక్త రాష్ట్రాల వ్యతిరేకి అయిన వాజ్‌పాయ్, ఆదివాసీ ప్రజల న్యాయసమ్మతమైన కోర్కెలను, యీ సమస్యపై కమ్యూనిస్టు పార్టీ వైఖరిని అంగీకరించరు. కానీ మన దేశ ప్రజలకు మన వైఖరి ఏమిటో బాగానే తెలుసు.

## వేర్పాటువాదుల సమాధానం యివ్వలేని దుస్థితి:

హిందీ మాట్లాడే ప్రజలు పలు రాష్ట్రాలలో విభజింపబడివుండగా, ఆంధ్ర రాష్ట్రం రెండు భాగాలుగానైనా, మూడు భాగాలుగానైనా విడిపోతే స్వర్గం కూలిపడిపోదని వాజ్‌పాయ్ వాదిస్తున్నారు. అయితే ఒకే భాష మాట్లాడే ప్రజలు ఒక రాష్ట్రం కంటే ఎక్కువ రాష్ట్రాలు కలిగివుండరాదనేది మా

అభిప్రాయం కాదు. ఆంధ్రప్రదేశ్‌ను విభజిస్తే, మొత్తం తెలుగు ప్రజలకు, ప్రత్యేకించి ఆంధ్ర ప్రాంతానికి ఏ విధంగా నష్టం సంభవిస్తుందో, తీవ్రమైన చిక్కు సమస్యలు ఏ విధంగా యెదురవుతాయో మేం స్పష్టంగానే చెబుతూవస్తున్నాం. వాజ్‌పాయ్ కాని, లేక ఏ యితర వేర్పాటువాద నాయకుడు గాని మా ప్రశ్నలకు ఎట్టి సమాధానం యివ్వలేదు. దానికి వారు యిచ్చే సమాధానం ఒక్కటే– ఐక్యరాష్ట్రంలో ఆంధ్రప్రాంత ప్రజలు "ఆత్మగౌరవం లేనివారు" గాను, "రెండవ తరగతి పౌరులు" గాను చూడబడుతున్నారని. ఆంధ్రప్రాంత ప్రజలలో ఉద్రేకాలను రెచ్చగొట్టేందుకై యీ మాటలను వాడడం జరుగుతుందనేది స్పష్టమే.

1969లో ప్రత్యేక తెలంగాణా కోసం జరిపిన పోరాటంలో కూడా ప్రత్యేక తెలంగాణావాదులు ప్రజల్లో యిదే విధమైన ఉద్రేకాలను రెచ్చగొట్టిన విషయం అందరికీ తెలిసిందే.

## భారతదేశం ముక్కచెక్కలయ్యే పరిస్థితి:

ఆంధ్రప్రదేశ్ విభజనకు సంబంధించిన యిదే వాదాన్ని, హిందీ భాషా రాష్ట్రాలతోసహా యితర భాషా రాష్ట్రాలన్నింటికీ వర్తింపచేస్తే భారతదేశం చిన్నచిన్న ముక్కలుగా చీలిపోయి, బలహీనపడిపోతుందనేది మా అభిప్రాయం. దీనికితోడు నేటి అత్యంత ప్రధాన ఆర్థిక, రాజకీయ సమస్యలనుండి అభివృద్ధి నిరోధక స్వార్థపరశక్తులకు, అమెరికా సామ్రాజ్యవాదులకు సంతోషం కలిగించే విధంగా కనిపించి మరో 10 సంవత్సరాల వరకు యావత్తు దేశం దృష్టి పక్కకి మళ్ళించబడుతుంది.

## నలభై రాష్ట్రాలుగా విభజించాలని జనసంఘ్ సిఫార్సు:

ఆంధ్రలో పరిస్థితులను పరిశీలించేందుకై యిక్కడకు వచ్చిన జనసంఘ్ బృందం, మన దేశాన్ని ప్రస్తుతం వున్న 20 రాష్ట్రాలుగా మాత్రమే కాకుండా 36, 40 రాష్ట్రాలవరకు విభజించవలసిందిగా లోగడే సిఫార్సు చేసింది.

ఆంధ్రప్రదేశ్‌ని విభజించడంవల్ల దేశంలోని యితర ప్రాంతాలలో అనేకచోట్ల యిటువంటి వేర్పాటు ఉద్యమాలు తలెత్తుతాయా? అని విజయవాడలో పత్రికలవారు ప్రశ్నించగా, జరగదని ఆయన బుకాయించారు.

## గోల్వాల్కార్ చిట్కా:

ఫిబ్రవరి 3వ తేదీన బెంగుళూరులో ఆర్.యస్.యస్. అధిపతి శ్రీ ఎం.ఎస్. గోల్వాల్కార్ యు.యన్.ఐ. ప్రతినిధితో మాట్లాడుతూ "మధ్యప్రదేశ్‌ను, ఉత్తరప్రదేశ్‌ను మూడేసి రాష్ట్రాలుగాను, ఆంధ్రప్రదేశ్‌ను రెండు రాష్ట్రాలుగాను విభజించా"లని చెప్పారు. ప్రధానంగా "మొత్తం దేశం అంతటికి ఒకే పార్లమెంటు, ఒకే ప్రభుత్వం మాత్రమే వుండే యూనిటరీ ప్రభుత్వం వుండాలని నేను కోరుతాను. ఆ లక్ష్యం నెరవేరకపోతే, చిన్న రాష్ట్రాలు ఏర్పడడం ఒక్కటే పరిష్కారమార్గం" అని ఆయన చెప్పారు. (ఫిబ్రవరి 3 టైమ్స్ ఆఫ్ ఇండియా, బొంబాయి ఎడిషన్)

ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్‌లను మాత్రమే ముక్కలుగా విభజించే పక్షంలో మహారాష్ట్ర, గుజరాత్ వంటి యితర రాష్ట్రాలను ఎందుకు విభజించరాదు? అదే వాదన యితర భాషాప్రయుక్త రాష్ట్రాలకు కూడా వర్తిస్తుందికదా? దేశంలో భాషాప్రయుక్తరాష్ట్రాలు వుండవలసిన అవశ్యకత లేదనీ, యావత్తుదేశం ఒకే యూనిటరీ ప్రభుత్వం క్రింద వుండాలని గోల్వాల్కార్ స్పష్టంగానే చెప్పారు. అది సాధ్యంకాకపోతే, ప్రస్తుతం వున్న రాష్ట్రాలను ప్రయోజన శూన్యమయిన చిన్న రాష్ట్రాలుగా విభజించాలి. ఈ వాదనలోని అంతరార్థం స్పష్టం అవుతూనేవుంది.

## యూనిటరీ ప్రభుత్వ స్థాపనే జనసంఘ్ ధ్యేయం:

ప్రస్తుతం వున్న భాషాప్రయుక్త రాష్ట్రాలను నామమాత్రమైన చిన్న రాష్ట్రాలుగా విభజించడమే జనసంఘ్ ఉద్దేశం. తర్వాత వాటిని ప్రాంతీయ రాష్ట్రాలుగా కలిపివేసే ప్రాతిపదికగా కాకుండా పరిపాలన, ఆర్థిక సౌలభ్యం దృష్ట్యా నాలుగైదు మిశ్రమ రాష్ట్రాలను ఏర్పాటుచేసి యూనిటరీ ప్రభుత్వాన్ని ఏర్పరచడమే వారి ప్రధాన ఉద్దేశం.

## స్వతంత్ర ఆంధ్ర రాష్ట్రం ఏర్పడుతుందట:

దేశ ఐక్యతకు ఆంధ్ర వేర్పాటు ఉద్యమం ఏమి చిక్కులు తెచ్చిపెడుతుందో అని వాజ్‌పాయ్‌కి ఆందోళన కలిగినట్లు వుంది. ఆంధ్ర వేర్పాటు ఉద్యమ కాంగ్రెస్ అగ్రనాయకుడు శ్రీ బి. వి. సుబ్బారెడ్డి ఆంధ్ర రాష్ట్రం యివ్వకపోతే, ఉత్తర భారతం నుండి దక్షిణ ప్రాంతం విడిపోతుందని ప్రతి

బహిరంగ సభలోనూ బహిరంగంగా సవాళ్ళు విసురుతున్నారు. అదే విధంగా, ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని యివ్వకపోతే 600 మైళ్ళ పొడవుగల సముద్రతీరంతో కూడిన "స్వతంత్ర ఆంధ్ర రాష్ట్రం" ఏర్పడుతుందని ఆంధ్ర స్వతంత్ర పార్టీ అగ్రనాయకుడు శ్రీ గౌతు లచ్చన్న హెచ్చరిస్తున్నారు. ఆంధ్రలో జరుగుతున్న బహిరంగసభల్లో ఈ విధంగా హెచ్చరించడంతో సంతృప్తిపడక, ఆయన మద్రాసు వెళ్ళి, అక్కడ ఫిబ్రవరి 1వ తేదీన అదే హెచ్చరిక చేశారు. బహూశా ఆయన మద్రాసులో తన డి.ఎం.కె. మిత్రులతో మంతనాలు జరిపేందుకే అక్కడకు వెళ్ళిన తరువాత, ఆంధ్రలో డి.ఎం.కె. ఎం.పి. విశ్వనాథన్ పర్యటనకు ఏర్పాటు చేసివుంటారు.

## డి.ఎం.కె., స్వతంత్ర ద్రవిడనాడు వివాదం:

ఈ సందర్భంగానే, దేశ సమైక్యత దృష్ట్యా, మనకు పరిచితమైన డి.ఎం.కె. వైఖరిని గుర్తుచేసుకోవలసి వుంది. దక్షిణ ప్రాంతంలోని నాలుగు రాష్ట్రాలను కలిపి స్వతంత్ర ద్రవిడనాడు ఏర్పాటుచెయ్యాలనే నినాదానికి వారు కట్టుబడి వున్నారు. అయితే దక్షిణ ప్రాంతానికి చెందిన యితర రాష్ట్రాలనుండి తమకు తోడ్పాటు లభించనందున డి.ఎం.కె. నాయకత్వం తమ "స్వతంత్ర తమిళనాడు" నినాదాన్ని మార్చుకుంది. పరిస్థితుల ఒత్తిడి కారణంగా, స్వతంత్ర తమిళనాడు నినాదాన్ని వదులుకున్నామని 1967లో డి.ఎం.కె. నాయకత్వం ప్రకటించింది. ఇటీవల "తమిళనాడుకు పూర్తి స్వయం పరిపాలన, కేంద్రంలో సంయుక్త ప్రభుత్వం" ఏర్పాటు చెయ్యాలంటూ అదే నినాదాన్ని మారురూపంలో ప్రకటించింది. రాష్ట్రాల ప్రతినిధులతో కేంద్ర ప్రభుత్వం ఏర్పడాలనీ, అది రాజకీయ పార్టీల మిశ్రమ ప్రభుత్వం కాదనీ శ్రీ కరుణానిధి సంయుక్త ప్రభుత్వ ఉద్దేశాన్ని వివరించారు.

## అకాలీ పార్టీ జాత్యహంకార వైఖరి:

ఆంధ్ర వేర్పాటు ఆందోళనను హృదయపూర్వకంగా సమర్థిస్తున్న మరొక జాత్యహంకార ప్రాంతీయ పార్టీ అయిన అకాలీ పార్టీ వైఖరిని కూడా యీ సందర్భంగా మనం గమనికలోకి తీసుకోవాలి.

"స్వతంత్ర సిక్‌స్థాన్"ను బలపరిచే యీ అకాలీ పార్టీలో పలుకుబడి కలిగిన వర్గం కూడా వుంది. అత్యంత క్లిష్టమైన సమయంలో, యిటీవల

జరిగిన భారత – పాకిస్తాన్ యుద్ధకాలంలోను, బంగ్లాదేశ్ విముక్త యుద్ధకాలంలోను అకాలీ పార్టీ కార్యదర్శి డాక్టర్ జగజిత్ సింగ్ దేశద్రోహిగా తయారయ్యాడు. ఇతగాడు పాకిస్తాన్‌కు పారిపోయి, స్వతంత్ర సిక్‌స్థాన్ నినాదాన్ని లేవనెత్తాడు. మన దేశానికి వ్యతిరేకంగా పాకిస్తాన్ రేడియోలో ఎంతో దుష్ప్రచారం చేశాడు. అకాలీ పార్టీ నాయకత్వం కొంతకాలం తటపటాయించి, చిట్టచివరకు అతడ్ని తమ పార్టీ నుండి బహిష్కరించింది.

## జాతీయ పతాకం దగ్ధం:

ఈ సంవత్సరం జనవరి 26వ తేదీన రిపబ్లిక్ దినంనాడు పంజాబులోని మోగా, జాగ్రాయ్‌లలో మన జాతీయ పతాకాలను పీకివేసి తగులబెట్టినట్లు పి.టి.ఐ. వార్తాసంస్థ తెలియజేసింది. అకాలీ పార్టీకి చెందిన విద్యార్థులు కొందరు యీ దుర్మార్గానికి పాల్పడ్డట్టు పంజాబ్ ముఖ్యమంత్రి శ్రీ జైల్‌సింగ్ తెలియజేశారు. "ఈ ఘటనను అక్కడి ప్రజలు, అన్ని రాజకీయ పార్టీలు ఖండించగా, అకాలీ పార్టీ ఎట్టి ప్రకటనా చెయ్యకపోవడం తనకు ఆశ్చర్యం కలిగించిం"దని ఆయన ప్రకటించారు. (ఫిబ్రవరి 4వ తేదీ, టైమ్స్ ఆఫ్ ఇండియా, బొంబాయి ఎడిషన్.)

## వాజ్‌పాయ్ పునరాలోచన:

మన దేశ ఐక్యతకు, గత మూడు సంవత్సరాలుగా మన దేశంలో కొనసాగుతున్న అభివృద్ధికర పరిణామాలకు ప్రమాదకరమైన యీ ఘటనలపట్ల దేశంలోని ప్రజాతంత్ర శక్తులు ఏమాత్రం అనాసక్త వైఖరి అవలంబించరాదు. ప్రాంతీయ జాత్యహంకార శక్తులతో చేతులు కలిపిన తర్వాత, వాజ్‌పాయ్‌లో పునరాలోచన వచ్చినట్లు కనబడుతోంది. ఆయన హైదరాబాద్‌లో ప్రసంగిస్తూ, ప్రత్యేక ఆంధ్రవాదులకు యీ విధంగా సలహా యిచ్చారు:

"వారు తమ భాషను అతి జాగ్రత్తగా వాడుకోవాలి. ఉత్తర భారతదేశంతో దక్షిణ భారతం ముఖాముఖి యుద్ధం జరుపుతుందనీ, లేదా దక్షిణ భారతం ఉత్తర భారతంనుండి విడిపోతుందనీ వారు చెప్పడం కొనసాగిస్తే, మిగతా దేశ ప్రజల సానుభూతి వారిపట్ల వుండదు. తమ రాష్ట్రాన్ని విభజించవలసిందిగా తాము కోరుతున్నామనే, అంటే దేశాన్ని విచ్ఛిన్నం చేయవలసిందిగా కోరుతున్నామనే అంశాన్ని వారు

మనస్సులో వుంచుకోవాలి" అని సలహా యిచ్చారు. (ఫిబ్రవరి ఇండియన్ ఎక్స్‌ప్రెస్, విజయవాడ ఎడిషన్) వాజ్‌పాయిగారూ! ఇది కేవలం భాషకు సంబంధించిన అంశం మాత్రమే కాదు! అవసరమైతే వేర్పాటువాదులు మీ సలహాను కూడా ఏ మాత్రం సరకు చెయ్యరు!!

## సూటిప్రశ్న:

యూనిటరీ ప్రభుత్వం ఏర్పడాలనీ, పటిష్టవంతమైన సమైక్య దేశం ఏర్పడాలనీ కోరుకునే మీరు, ఉత్తర భారతదేశానికి వ్యతిరేకంగా, దక్షిణ భారత ప్రజలలో జాత్యహంకార భావాలను రెచ్చగొట్టేందుకు, అవసరమైతే మన దేశాన్ని చీల్చడానికి కూడా వెనుతీయనివారితో మీరు ఎందుకు చేతులు కలుపుతున్నారో వివరించవలసిందిగా నేను అడగవచ్చునా? ఈ విధంగా వేర్పాటువాదులతోను, అభివృద్ధి నిరోధక స్వార్థపర శక్తులతోను, యీ విషయంలో పూర్తి విచ్చిన్న శక్తులతోను మీరు చేతులు కలపడం పచ్చి అవకాశవాదం కాదా?

## వేర్పాటు ఉద్యమ నాయకుల భిన్న వైఖరులు:

నేడు ఆంధ్ర వేర్పాటు ఆందోళన తీవ్రదశకు చేరుకుంది. ఇంతవరకు వేర్పాటు కాంగ్రెస్ నాయకులు, కాంగ్రెసేతర వేర్పాటువాద శక్తులు, ఆచరణలో కలిసి పనిచేస్తున్నా, వారి సంస్థలు కొంతవరకు అయినప్పటికీ వేరువేరుగా వున్నాయి. ఇప్పుడు వీరు ఒక సంయుక్త కార్యాచరణ కమిటీని నెలకొల్పి ఒక తీవ్రమైన కార్యక్రమాన్ని రూపొందించారు. ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చెయ్యకపోతే కేంద్ర నాయకత్వంతో ఏ విధమైన చర్చలు జరపవద్దని చెబుతూ, "విప్లవం" తెస్తామని బెదిరించే సేనల నాయకులు, విద్యార్థి నాయకులు కూడా జాయింటు కార్యాచరణ కమిటీలో వున్నారు. కేంద్ర నాయకత్వంలో చర్చలు జరపాలని కోరిన కాంగ్రెస్ మాజీ మంత్రులలోని ఒక వర్గం ఉగ్రవాదుల ఒత్తిడి కారణంగా, తమ ఢిల్లీ పర్యటనను బలవంతంగా రద్దుచేసుకోవలసి వచ్చింది. ఆంధ్ర వేర్పాటువాదులు బహిరంగంగానే తెలంగాణా వేర్పాటువాదులతో చేతులు కలిపి, తమ కార్యకలాపాలను సమన్వయపరచుకుంటున్నారు. ఏ రూపంలో ఉద్యమాన్ని నిర్వహించాలనే విషయంలో ప్రత్యేకవాద నాయకులలో తేడాలు వున్నాయి. కొందరు ఉద్యమాన్ని అహింసాయుత

# విశాలాంధ్ర

## ఆంధ్రప్రదేశ్‌ను చీల్చడం ఎవ్వరి తరంగాదు!



### సమైక్య రాష్ట్రంలోనే తెలుగుజాతి పురోగతి

### బందరులో 100 మందిచే సామూహిక నిరాహారదీక్షలు

ఆంధ్రప్రదేశ్‌ను చీల్చడం ఎవ్వరి తరం కాదని – ప్రత్యేక ఆంధ్రవాదులు పెచ్చరిల్లిన విజయవాడలో ఢంకా బజాయించుతూ శ్రీ చంద్ర రాజేశ్వరరావు చేసిన ప్రకటన. (20–3–1973, విశాలాంధ్ర)

పద్ధతులకు మాత్రమే పరిమితం చెయ్యాలని, త్వరలో ఉద్యమం విజయవంతం అయ్యేందుకు అన్ని హింసాపూరిత పద్ధతులను ఉపయోగించుకోవాలని మరికొందరు కోరుతున్నారు. అయితే యిందులో ఎవరు పైచేయి సంపాదిస్తారో ఫలితాలు ఎలా వుంటాయో వేచి చూడవలసివుంది.

రాష్ట్రంలో ప్రస్తుతం సంభవించిన యీ సంక్షోభం యొక్క ప్రమాదకరమైన ప్రభావాలు యావద్భారత దేశంపైన పడతాయి.

మన దేశంలోని అన్ని వామపక్ష ప్రజాతంత్ర శక్తులు ఏకమై అన్ని రాష్ట్రాలలోని ప్రజలకు ప్రమాదకరమైన యీ దుష్ప్రభావాలకు లోనుగాకుండా వివరించి చెప్పాలి. అభివృద్ధి నిరోధక, ప్రాంతీయ జాత్యహంకార తిరోగామి శక్తుల చర్యలను తిప్పికొట్టాలి.

*(1973, ఫిబ్రవరి 8, విశాలాంధ్ర)*

## ఎన్నెన్ని సంఘాలు? ఎన్నెన్ని సేనలు?

ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ఆందోళన సందర్భంలో ఈ విచ్ఛిన్నకర శక్తులు ఎంత అరాచకానికి, ఎంత బీభత్సానికి, ఫాసిస్టు చర్యలకు దిగారో, ఎన్నెన్ని సంఘాలు, ఎన్నెన్ని సేనలు కుక్కగొడుగుల్లా పుట్టుకొచ్చాయో వేరే చెప్పనవసరం లేదు. ప్రతీ రోజు బంద్‌లు, సమ్మెలు ఎవరంతట వారు చేస్తూ రాష్ట్రాన్ని ఆనాడు అతలాకుతలం చేశారు.

మచ్చుకి:

1. అఖిలాంధ్ర కార్యాచరణ సమితి
2. ఆంధ్ర కాంగ్రెస్ కార్యాచరణ సమితి
3. ఆంధ్ర కార్యచరణ సమితి
4. ఆంధ్ర ప్రజా పరిషత్
5. ఆంధ్ర సేన
6. కాకాని బ్రిగేడ్
7. ఆంధ్ర పటాలము
8. ఆంధ్ర యువసేన
9. సంఘర్ష సమితి
10. సమరసేన
11. విముక్తి వాహిని
12. ఆంధ్ర సంయుక్త వాహిని

13. విప్లవ సేన
14. విముక్తి సేన
15. వీర సేన
16. వాయు సేన
17. శాంతి సేన
18. జై ఆంధ్ర సేన
19. జై ఆంధ్ర యువ సేన
20. విద్యార్థి పరిషత్తు
21. ఎన్.జి.ఓ.ల కార్యాచరణ సంఘం
22. పొట్టి శ్రీరాములు సమితి
23. జై ఆంధ్ర క్రీడాకారుల సంఘం
24. అడ్‌హాక్ ఆంధ్ర సేన
25. పీపుల్స్ బ్రిగేడ్
26. ఆంధ్ర ప్రజా సైన్యం
27. యూత్ టర్క్స్
28. స్వతంత్ర సేన
29. జై ఆంధ్ర మహిళా సంఘం
30. సంజీవయ్య బ్రిగేడ్
31. ఎన్.టి.ఆర్. అభిమాన శాంతి సేన
32. వీర కాకాని బ్రిగేడ్.

* * *